# క్షేత్రయ్య

రచన:

అయినంపూడి గురునాథరావు

ప్రధాన సంపాదకుడు:

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ:

శ్రీ సిహెచ్. వేంకటపతిరాజు, ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు.

1989

T. T. D. Religious Publications Series No. 347

SRĪNIVĀSA BĀLABHĀRATI-49
( Children Series )

KSHETRAYYA
by Ayinampudi Gurunatha Rao.

*Chief - Editor :*
Dr. S. B. Raghunathacharya

First edition 1989

Copies : 10, 000.

Price : 1-00

*Published by*
Sri Ch. Venkatapathi Raju, I.A.S.,
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

Art : CHĀYA

Printed at :
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

అద్దంలాంటి మనసు, వద్దన్నా తన ముందున్న దాన్ని తనలో ప్రతిబింబిస్తుంది. పదిలంగా ఉండి తన నిర్మల త్వంతో పదిమందినీ ఆకర్షించే ఆ మనస్సు, అల్లారుముద్దుగా పెరిగే అందాల బాలల్లో కనిపిస్తుంది. అమాయకమైన ఆ వయస్సులో అమరిన సంస్కారాల ముద్రలు వారి జీవన మంతా చెరిగిపోకుండా నిలబడతాయి. భారతీయ సంస్కృతికి భవ్యమైన మార్గాలనందించిన మహనీయులెందరో మన ఇతిహాస పురాణాల్లో చోటుచేసుకున్నారు. వారిలో ప్రతి ఒకరు ఏదో ఒక ఆదర్శానికి అంకితమైనవారే.

ఏ ఆదర్శం లేని జీవితం చుక్కాని లేని నావలాగా నిర్దిష్టమైన లక్ష్యం లేకుండా సాగిపోతుంటుంది. ఎన్ని చదువులు చదివినా, ఎన్ని పదవుల నేలినా భారతజాతి కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేసే చక్కని సంస్కృతికి మన చిన్నారులు వారసులు కావాలి. ఆ సంకల్పంతోనే కొన్ని ఆదర్శాలను కథాకథన పద్ధతిలో చిన్నారి బాలలకు అందించడానికే శ్రీనివాస బాలభారతి ఉదయించింది.

ఇది బాలభారతి అయినా ఈ ప్రణాళికలో ఇప్పటికి ప్రచురింపబడిన సుమారు యాభై పుస్తకాలు పెద్దవాళ్లను గూడా ఎంతగానో ఆకర్షించినాయని వినడానికి ఎంతో సంతోషంగా ఉంది. పెద్దలు తాము చదివి తమ పిల్లల చేత గూడా చదివిస్తే తిరుమల తిరుపతి దేవస్థానాల ఆశయం కొంతకు కొంత నెరవేరుతుంది.

ఈ శ్రీనివాస బాలభారతి ప్రణాళికను తయారుచేసి, బాలసాహిత్యాన్ని చక్కగా తీర్చిదిద్ది, మంచి రచనలను తయారు చేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్ పబ్లికేషన్స్, టి.టి.డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికకు సహకరిస్తున్న రచయితలకు, కళాకారులకు నా ధన్యవాదాలు.

సి. హెచ్. వేంకటపతిరాజు, ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్ను విప్పేనాటికే సభ్యతకు, సంస్కారానికి, నైతిక, ధార్మికాదర్శాలకు పేరు పడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతి మానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో నడచి మహనీయకీర్తి నార్జించిన వాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖ సంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మన స్మృల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి', 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం', 'ఇది నా కర్తవ్యం' అని ప్రతి బాలుడు, బాలిక ఈ దేశసేవకు తనను అంకితం చేసుకొంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందఱో మహానుభావులు మహా పురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవన

వాహినిని మనదాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు, మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్ళను అర్థం చేసుకోవడం, వాళ్ల చరిత్ర మననం చేసుకోవడం, వారి ఆదర్శాలు స్మరించడం కూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మన జాతి జీవన ప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!

నిండు మనస్సుతో మీకిదే మా స్వాగతం!

డాక్టర్ ఎస్.బి. రఘునాథాచార్య

ప్రధానసంపాదకుడు

# పరిచయం

గోపాలపదసాయుజ్యాన్ని కోరి అలతి అలతి పదాలతో మధురభక్తికి మహాపట్టాభిషేకం చేసి ఆయన దివ్యానుగ్రహ వీక్షణలలో తన జీవన మాధుర్యాన్ని చవిచూచాడొక మహానుభావుడు. ఆయనెవరో తెలుసా? మహాకవి క్షేత్రయ్య. అది ఆయన ప్రసిద్ధ నామధేయం. అసలు పేరు వరదయ్య. మువ్వగోపాలుని పాదపద్మసన్నిధి 'మొవ్వ' ఆయన జన్మస్థలం.

'పదిహేనువందల పదాలు నలభైరోజుల్లో రచించ' మన్నాడు గోల్కొండనవాబు. ముప్ఫైతొమ్మిదిరోజులు గడిచాయి. వరదయ్య ఆ విషయం పట్టించుకోలేదు. ఒక్క పదం కూడా రచించలేదు. మోహనాంగి హాహాకారాలు పెడుతున్నది. ఒకే ఒకరాత్రిలో మూర్తీభవించిన మువ్వగోపాలుడై పదిహేనువందల పదాలను రచించి ఆస్థానంలో అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసిన అసమాన వాగ్గేయకార శిరోమణి క్షేత్రయ్య.

కాంచీనగరంలో వరదరాజసన్నిధిలో ధ్యాననిమగ్నుడైన వరదయ్యను అర్చకులు గమనించలేదు. రాత్రిసేవలు ముగిశాయి. కవాటాలను బంధించి అందరు వెళ్లిపోయారు. తెల్లవారు జామున ధ్యానం నుంచి కళ్లు తెరచి చూచాడు వరదయ్య. అరజారిన విరిదండ జడతో అరవిందాసన స్వామి మందిరంనుంచి తన మందిరానికి వెడుతూ వరదయ్యకు దర్శనమిచ్చింది. అటువంటి దేవీ అనుగ్రహపాత్రుడు, మధురానుభూతి సంపన్నుడు, మహాకవి, మహాభక్తుడు క్షేత్రయ్య.

ఆయన భక్తి మనకాదర్శం కావాలి. ఆయనలోని గోపాలపదపద్మ సమారాధనాసక్తి మనకు మార్గదర్శకం కావాలి. ఇక చదవండి.

—రఘునాథాచార్య

# క్షేత్రయ్య

**అరుదైన ఆశీస్సు :**

అదొక పల్లెటూరు.

ఆ వూరి నడిబొడ్డున ఒక దేవాలయం.

ఆ ఆలయప్రాంగణంలో ఒకనాటి రాత్రి తరుణ వయస్కుడైన భక్తుడొకడు కళ్లుమూసుకొని ధ్యానమగ్ను డై వున్నాడు. ఆలయపూజారులు స్వామిసేవలు ముగించు కొని ఆలయద్వారాలు బంధించి వెళ్లిపోయారు. అతని ధ్యానభంగం చెయ్యడం వారికి ఇష్టంలేదు.

తెలతెలవారుతుండగా చలిగాలితాకిడికి అతనికి తెలివి వచ్చింది. గుడితలుపులు తెరచివున్నాయి. స్వామి తన మోహనాకారంతో ప్రత్యక్షమై ఎదుట నిలబడి వున్నాడు. ఆ మనోహర దృశ్యం ఒక క్షణకాలంమాత్రమే

అతని కళ్ళయెదుట మెదిలింది. కాని స్వామి ఆశీస్సు మాత్రం విస్పష్టంగా వినబడ్డది.

"ఓయీ! పదకర్తగా నీవు లోకవిఖ్యాతి గడించ గలవు. నీ పదాలు తరతరాలుగా జగద్వ్యాప్తం కాగలవు, వెళ్ళు. రాజాస్థానాలు పుణ్యక్షేత్రాలూ దర్శించు. నీపదాల ద్వారా దేశం నాలుగుచెరగులా నా మధురభక్తినీ, ప్రేమ సందేశాన్ని వినిపించు."

అతనాపారవశ్యంతో నాలుగువైపులా కలయ జూశాడు. ఆలయకవాటాలు మూయబడి వున్నాయి. తన సమక్షంలోగాని పరిసరాల్లోగాని ఎవ్వరూ కనబడ లేదు. తనకు భగవద్దర్శనం లభించినట్లు అతను గ్రహిం చాడు. వెంటనే ఆలయానికి దగ్గరలోవున్న తన యింటికి పరుగుపరుగున వెళ్ళాడు.

ఆ వూరు సంస్కృతీనిలయమని పేరుమోసిన కృష్ణా మండలంలోని మొవ్వ.

ఆ ఆలయం మువ్వగోపాలుని దివ్యమందిరం.

ఆ యువభక్తుడు ఆంధ్రకళాసరస్వతికి స్వర్ణనీరాజనం పట్టిన ప్రఖ్యాత పదకర్త క్షేత్రయ్య. క్షేత్రయ్య అతని ప్రజ్ఞానామం. అసలు పేరు మొవ్వ వరదయ్య.

## తల్లి మనసు తల్లడిల్లింది:

ఇంటికి వెళ్ళగానే అతను తన తల్లి పాదాలమీద వ్రాలి అన్నాడు, "అమ్మా! నాకు స్వామి సాక్షాత్కరించాడు. నా పదాలద్వారా మువ్వగోపాలుని మహిమను కీర్తిస్తూ నేను దేశదేశాలు తిరిగి భక్తిప్రచారం చెయ్యాలి. నన్ను దీవించు".

ఆమె దిగ్భ్రాంతి చెందింది. ఆమె మాతృహృదయం విలవిలలాడిపోయింది. కాని ప్రాజ్ఞుడైన వరదయ్య తండ్రి, వరదయ్య మాటలు విని ఆనందబాష్పాలు రాలుస్తూ అతని దగ్గరకువచ్చి అతన్ని గాఢంగా కౌగలించుకున్నాడు. అతనికి దివ్యావేశం కలిగిందని గ్రహిం

చాడు. ఆ స్థితిలో అతని దారికి అడ్డురావడం భావ్యం కాదనుకున్నాడు. తల్లిదండ్రుల ఆశీస్సులు పొంది వరదయ్య ఇల్లువిడిచి బయలుదేరాడు.

## అదొక ఆనందమైన ప్రపంచం:

వెంటనే అతను మోహనాంగి యింటికి వెళ్లాడు. మోహనాంగి దేవదాసి. మోహినీ వరదయ్యా ఇద్దరూ సహాధ్యాయులు. ఇద్దరూ మువ్వలోనే పుట్టిపెరిగారు. ఇద్దరి వయసూ ఇంచుమించు ఒకటే. బాల్యంలో రోజూ ఇద్దరూ నాట్యం సంగీతం నేర్చుకునేందుకు అక్కడికి కొద్దిదూరంలోనే వున్న కూచిపూడి కళాక్షేత్రానికి కలిసి వెళ్తూవుండేవారు. దారిలో వారిద్దరూ ఆడుతూపాడుతూ ఎంతో ఆనందించేవారు. కులాలువేరైనా వారెంతో ఆత్మీయంగా వుండేవారు.

వరదయ్య సంగీతసాహిత్యాల్లో మంచిపాండిత్యం గడించాడు. బాల్యంనుంచీ అతను శృంగారరసాన్ని

ఆలంబనగా చేసుకొని మధుర భక్తిపరమైన చక్కనిపదాలు రచించి పాడుతూ వుండేవాడు. మోహనాంగి దేవదాసి కావడంచేత నాట్యం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య. ఆలయనర్తకిగా ఆమె ప్రత్యేక శిక్షణ పొందింది. సంగీత సాహిత్యాల్లోకూడ ఆమె అందెవేసిన చెయ్యి అనిపించు కుంది.

ఇద్దఱూ కళారాధకులు. సౌందర్యోపాసకులు. అంతేకాదు మువ్వగోపాలుని అనన్యభక్తులు. తీరికలభించి నపుడల్లా ఇద్దఱూ గోపాలదేవుని మందిరానికి వెళ్ళేవాళ్ళు. వరదయ్య తాను రచించిన పదాలను మధురస్వనంతో పాడుతూవుంటే ఆ పదభావాలకు అనుగుణంగా మోహన పారవశ్యంతో నాట్యం చేసేది. అప్పుడు ఆమె ముఖంలో దివ్యతేజస్సు కొట్టవచ్చినట్లు కనబడేది. వరదయ్య ఆమె నాట్యానికి తన్మయత్వం చెందిపోయేవాడు. ఇద్దఱూ ఆ సమయంలో ఈ లోకాన్ని మరచి అలౌకికమైన మఱో ప్రపంచంలో వున్నట్లు గోచరించేవారు. అది రసాత్మక

మైన కళాప్రపంచం. ఆ ప్రపంచంలో వారికి గోపాల దేవుడు తప్ప ఇంకెవ్వరూ గోచరమయ్యేవారుకాదు.

## మోహన మోహంలో :

ఈ విధంగా వారిద్దఱూ బాల్యంనుంచీ కలిసి మెలిసి తిరిగారు. ఒకేచోట విద్యాభ్యాసం చేశారు. గోపాలదేవుని సేవించారు. క్రమంగా పెరిగి పెద్దవాళ్లయ్యారు. వారిలో యౌవనం అంకురించింది. వారి మానసవీథుల్లో ప్రేమారవిందాలు మొగ్గతొడిగాయి. కూచిపూడి కళాక్షేత్రంలో గురువులవద్ద భరతనాట్య శాస్త్రము భానుదత్తుని రసమంజరీ కూలంకషంగా అభ్యసించి జీర్ణించుకున్నారు. దానిఫలితంగా వారి మనోభావాలు సంస్కారపూరితాలై పరస్పర ప్రేమబంధానికి దారితీశాయి.

వారికి తెయకుండానే అలాకొంతకాలం హాయిగా గడిచిపోయింది. వారు భౌతికజీవితాన్ని తనివిదీరా చవి

చూచారు. వరదయ్య రాత్రివేళ ఎప్పుడూ మోహనాంగి యింట్లోనే గడిపేవాడు.

## ఆయన్ను ప్రేమించాలి :

వరదయ్యకు మువ్వగోపాలుని సాక్షాత్కార భాగ్యంలభించిన రోజున అతను మోహనాంగి యింటికి వెళ్ళలేదు. విరహవేదనతో మోహనాంగి తపించిపోయింది. ఆ రాత్రంతా ఆమెకు కునుకుపట్టలేదు. వరదయ్య రావడంచూసి ఆమె ఆనందంతో పొంగిపోయింది. అతన్ని లోనికి తీసుకొని వెళ్ళింది. రాత్రి నిద్రలేక పోవడంచేత ఆమెకళ్ళు కొంచెం మూతలు పడుతున్నాయి.

'వరదా! ఏంజరిగింది? రాత్రి రాలేదేం? నేను భయపడిపోయాను. ఇలా నన్ను విడిచి ఎక్కడకూ వెళ్ళకు' జాలిగా అన్నది మోహన.

వరదయ్య తలవంచుకొని, 'మోహనం! నిన్ను విడిచివెళ్ళిపోతున్నానని చెప్పడానికే నేను ఇక్కడకు వచ్చాను' అన్నాడు.

మోహన మనస్సు గతుక్కుమన్నది. ఆమె తల్ల డిల్లిపోయింది. వరదయ్య ఆమెను దగ్గరకు తీసుకొని జరిగినదంతా చెప్పి, 'మోహనం! నేను ఇక భౌతికజీవితానికి దూరంకాక తప్పదు. మువ్వగోపాలుడే ఇక నా సర్వస్వం. నేను ఆయన్ను ప్రేమించాలి. సన్నుతించాలి. మధురభక్తిభరితాలైన శృంగారపదాలతో ఆయన మహిమను దేశం నాలుగువైపులా చాటాలి' అన్నాడు.

## నీదారికి అడ్డురాను !

మోహనాంగి వివేకంగలది. వరదయ్యలో వచ్చిన ఆ రాత్రి పరిణతికి ఆమె పులకించింది. ఆమెకళ్లల్లో ఆనంద రేఖలు తరళించాయి. కాని క్షణంలో అవి మాయమైనాయి. వెంటనే నిస్పృహతో అన్నది.

'వరదా! నేను నిన్ను విడిచి యెలావుండగలను? నాకు నీతోడిదే బ్రతుకు. నేనూ నీతో వస్తాను. నీవెలాటి జీవితంగడపాలను కుంటున్నావో నేనూ అలాటి జీవితాన్నే

గడుపుతాను. నీదారికి నేను అడ్డురాను. నిన్ను సేవిస్తూ నీతోపాటు గోపాలదేవుని మహిమను నా నాట్యాలద్వారా జగద్వ్యాప్తంచేస్తాను."

"అలాగే, కాని ఇప్పుడు కాదు. నేను కంచివరదుణ్ణి దర్శించాలనుకుంటున్నాను. నాకు నా తలిదండ్రులు ఆయనపేరే పెట్టారు. కాంచీనగరంలో వుండగా నీకు వర్తమానం చేస్తాను. నీవు నన్ను అక్కడ కలిసికొందువు గాని. ఈలోగా నా ఉద్యమంలోనాకు కొంత ధైర్యం చిక్కుతుంది" అన్నాడు వరదయ్య.

## ఎన్నడూ ఊహించలేదు:

మోహన వరదయ్య మాటలను శాంతంగా విన్నది. విధిలేక సరేనన్నది. వరదయ్య అతికష్టంమీాద గద్గద కంఠంతో ఆమెకు వీడ్కోలు పలికి చటుక్కున బయటు పడ్డాడు. మోహనపై పిడుగుపడ్డట్టయింది. ఆమె నివ్వెర పోయింది. తన్నలా వంటరిగా విడిచిపెట్టి వరదయ్య

వెళ్లగలడని తానెన్నడూ వూహించలేదు. ఉద్వేగంతో ఆమె గజగజలాడిపోయింది. వరదయ్య ఇక తనవాడు కాదనుకున్నది. మువ్వగోపాలునకు సర్వాత్మనా వశీభూతుడైనాడని గ్రహించింది.

## గోల్కొండలో గొప్ప గౌరవం :

వరదయ్య పదకవితాదీక్షతో బయలుదేరాడు.

అతని తొలిమజిలీ గోల్కొండ.

అది పదునేడవశతాబ్దం. అబ్దుల్లా కుతుబ్షాహయాం నృత్యగీతాది లలితకళలమీద నవాబుకు అపారమైన మోజు. అతని ఆస్థానంలో మేధావులైన బ్రాహ్మణులెందఱో ఉన్నత పదవుల్లో వున్నారు. వారిలో కొందఱితో వరదయ్యకు ముట్టరికంకూడా వుంది. అంచేత వారి సహాయ సంపత్తితో వరదయ్యకు నవాబుతో పరిచయం ఇట్టే లభించింది. గోల్కొండ దర్బారు పటాటోపంచూసి వరదయ్య చకితుడయ్యాడు. అతను నవాబును సన్నుతిస్తూ

కొన్ని పదాలు చెప్పాడు. నవాబు సంప్రీతుడై వర దయ్యను బాగా ఆదరించాడు.

## కమల ఎత్తులకు కలవరపడలేదు :

నవాబు ఆస్థానంలో కమల రాజనర్తకి. వరదయ్య స్ఫురద్రూపి. అదీకాక అతను నిండుయౌవనంలో మిసమిస లాడుతూ వున్నాడు. తొలిచూపులోనే ఆమె అతన్ని వల చింది. అతన్ని తనవశం చేసుకోవాలని యెన్నోయెత్తులు వేసింది. కాని వరదయ్య చలించలేదు. ఇప్పుడాతని దృక్పథం వేఱు. తన పదాలద్వారా మువ్వగోపాలునిమహి మను దేశమంతటా చాటుతూ తన జీవితశేషాన్నిగడ పాలనే ఉదాత్తాశయంతో బయలుదేరాడు. తాను భౌతిక జీవితమే అభిలపిస్తే మోహనకంటె తగిన జీవిత భాగ స్వామిని తనకు ఇంకెవ్వరు లభింపరు. ఏవంకా పెట్టు డానికి వీలులేని అందాలరాశి ఆమె. తన ఆశయాలకు ఔన్నత్యమూ దివ్యత్వమూ కల్పించుకుని తుదకు మువ్వ గోపాలునితో ఐక్యంకావడమే అతని లక్ష్యం. అంచేతనే

అతను కమల ప్రలోభానికి అణుమాత్రంకూడా చలించ లేదు.

## కుతుబ్షాపోషణలో కూచిపూడి :

మరికొన్ని రాజాస్థానాలను పుణ్యక్షేత్రాలను దర్శించాలని అతని ఆకాంక్ష. అంచేత అతను గోల్కొండ విడిచి వెళ్లడానికి నిశ్చయించుకున్నాడు. ఎంతగానో తనను ఆదరించిన నవాబును విడిచివెళ్ళడానికి వరదయ్యకు కష్టంగానే వుంది. ఎందుకంటే కుతుబ్షా చాలా సహృద యుడు. భరతనాట్యానికి నిలయమైన కూచిపూడి అతని ఏలుబడిలోనిదే. కూచిపూడిని భరతనాట్య కళాకేంద్రంగా తీర్చిదిద్దిన సిద్ధేంద్రయోగి అభ్యర్థనపై నవాబు అక్కడి భాగవతులకు కూచిపూడిని అగ్రహారంగా ఇచ్చి తన కళాప్రియత్వానికి దీర్ఘాయువు పోశాడు. వరదయ్య నృత్యసంగీతాలు అభ్యసించింది అక్కడే. అంచేత వర దయ్య మొట్టమొదట గోల్కొండ రావడంలో అదికూడా ఒక కారణం.

## తిరుగుప్రయాణంలో....

గోల్కొండ విడిచివెళ్లడానికి వరదయ్య నవాబు అనుమతి కోరాడు. నవాబు చకితుడయ్యాడు. వరదయ్య తన ఆస్థానంలోనే శాశ్వతంగా వుండి ఆస్థానానికి వన్నె తెస్తాడని ఆశించాడు. కాని వరదయ్య నవాబుకు తన ఆశయాన్ని వివరించి తిరుగుప్రయాణంలో కొంతకాలం అక్కడ వుండడానికి యత్నిస్తానని చెప్పి బయలుదేరాడు. రాజనర్తకి కమల మాత్రం నిరాశతో క్రుంగిపోయింది.

## మదురైలో మంచి ఆదరణ :

వరదయ్య తర్వాత మజిలీ మదురై.

నాటి మదురై పరిపాలకుడు తిరుమలనాయకుడు. తెలుగువాడు. విజయనగరసామ్రాజ్యపు రోజుల్లోనే పరాక్రమనిధులైన తెలుగుయోధులెందరో దక్షిణదేశం వలసవెళ్లి రాజ్యాలు స్థాపించి పరిపాలించారు. తెలుగు రాజభాషగాగల ఆ రాజ్యాలన్నీ వరదయ్య దర్శించాడు.

ఆనాడు తెలుగుసాహిత్యం మూడుపూవులారుకాయలుగా విలసిల్లిన రాజాస్థానాల్లో మదురై ఒకటి.

అంచేత వరదయ్యకు హృదయపూర్వకమైన స్వాగతం లభించింది. తిరుమలనాయకుడు రసజ్ఞుడు. గొప్ప సంస్కారం కలవాడు. గోల్కొండ ఆస్థానంలాగ మదురైఆస్థానం భోగపరమైనది కాదు. ఆధ్యాత్మికచింతన నియమనిష్ఠలూ ఎక్కువ. వరదయ్య తిరుమలనాయకుని సన్నుతిస్తూ కొన్ని పదాలు చెప్పాడు.

## దివ్యప్రేమకు శృంగారపు సింగారం:

ఆ రోజుల్లో రాజాస్థానాల్లో శృంగారకావ్యాలకే ప్రాధాన్యం. శృంగారరసానికి వున్నంత ఆదరణ ప్రాప కమూ ఇంకేరసానికి లేదు. అందుచేతనే వరదయ్యకూడా అందరికీ అందుబాటులో ఆస్వాదనీయంగా వుండే శృంగా రాన్నే ఆధారంగా చేసుకొని పదరచన చేశాడు.

నృత్య సాహిత్య సంగీతాల త్రివేణీసంగమాలుగా వరదయ్యపదాలకు అఖండఖ్యాతి లభించింది. అతని పదాల్లోని ఇతివృత్తం విశ్వజనీనమైన విశుద్ధ ప్రేమ. కాని దానికి భక్తిరూపకమైన మధుర శృంగారం మేలి ముసుగులాగా వుంటుంది. భక్తులూ పండితులూ అతని పదాల్లో నిగూఢంగా అంతర్వాహినిగావున్న దివ్యప్రేమకు ఉత్తేజితులయ్యేవాళ్లు. ఇక సామాన్యులు ఆ పదాల్లోని సరళశృంగారానికి, మధురాతిమధురమైన తెనుగు నుడికారానికి ముగ్ధులయ్యేవాళ్లు. వరదయ్య పదాల్లోని మహా వైభవ మది.

## ఎలా చేయగలుగుతున్నాడు!

వరదయ్య విశాలభావాలు తిరుమలనాయకుని మనస్సును ఇట్టే ఆకర్షించాయి. అతను పరిణతమైన ప్రజ్ఞ కలవాడని ఆయన గ్రహించాడు. ఆస్థానకవులకుకూడా వరదయ్యమీద భక్తిభావం ఏర్పడింది. అంతటి సహజ సుకుమారమైన భాషాశైలిలో అప్రయత్నంగా స్వేచ్ఛగా

శృంగారరసాన్ని ఆలంబనంగా చేసుకొని పరతత్త్వాన్ని గూర్చిన పదరచన అతను ఎలా చెయ్యగలుగుతున్నాడా అని వారు విస్తుపోయేవారు.

## అద్భుతసృష్టి ఆ ఆలయం!

మదురైలో వరదయ్య ఎక్కువ రోజులు లేడు. ఉన్న కొద్దిరోజుల్లోనే తిరుమలనాయకుని ఆస్థానంలో అతను మంచి పేరుప్రతిష్ఠలు తెచ్చుకున్నాడు. అతను తిరుమలనాయకుని మీద కొన్ని పదాలు చెప్పాడు. మదురై లోని మీనాక్షీదేవాలయం ఒక అద్భుతసృష్టి. అదొక అపూర్వ కళాఖండం. అది కేవలమానవమాత్రులు నిర్మించినట్లుగా గోచరించదు. కళాతపస్సులో పండిన దివ్యాంశసంభూతు లెవరో సృజించినట్లు కనబడుతుంది. ఆ నిర్మాణవైభవం అట్టిది. అక్కడ వున్నన్నాళ్లూ వరదయ్య అనుదినం ఆలయాన్ని దర్శించేవాడు. దేవిని ఆరాధించేవాడు.

**శివకంచి; విష్ణుకంచి :**

మదురైనుంచి వరదయ్య కాంచీనగరం వెళ్లాడు. కంచి ప్రాచీన క్షేత్రం. సర్వమతసమన్వయానికి అది ఆటు పట్టు. శైవ వైష్ణవ మతాలకేకాక బౌద్ధ జైనమతాలకు కూడా అది ఆశ్రయం కల్పించింది. అచట ఆలయాలు ఆకాశాన్ని తాకుతూ వుంటాయి. శివకంచి అనీ, విష్ణు కంచి అనీ కాంచీనగరం రెండువిభాగాలుగా వుంటుంది.

శివకంచిలో ఏకామ్రేశ్వరాలయం, కామాక్షీదేవి మందిరం అద్భుతంగా వుంటాయి. ఏకామ్రేశ్వరాలయంలో యుగ యుగాలనాటి మామిడిచెట్టు ఒకటి వుంది. కామాక్షీదేవి ఆ చెట్టుక్రింద కూర్చుండి శివుణ్ణి గూర్చి తపస్సు చేసిందనే ఐతిహ్యం వుంది. ఆ చెట్టు నాలుగు కొమ్మలమీదా నాలుగు విభిన్న రుచులుగల కాయలు కాస్తాయి. అది ఆ చెట్టుయొక్క ప్రత్యేకత. అదేకాక ఆ చెట్టు తాలూకూ నాలుగు కొమ్మలూ నాలుగు వేదాలకు సంకేతాలుగా కూడా భావిస్తారు.

విష్ణుకంచిలో వరదరాజస్వామి ఆలయం ఎంతో గంభీరంగా అద్భుతంగా వుంటుంది. ఆ ఆలయంతాలూకూ ఏడంతస్తుల శిఖరం చూసి వరదయ్య హృదయం జలదరించింది. వరదరాజస్వామి మొదటి అంతస్తు మీద వుంటాడు. ఆయన దేవేరి లక్ష్మీదేవిమందిరం దానికి కొద్దిదూరంలో వుంది.

## నా జీవితం ధన్యమైంది:

వరదయ్య వరదరాజస్వామిని చూసీచూడగానే పరవశించి ఆయన్ను సన్నుతిస్తూ పదాలు రచించి గానం చేశాడు. ఒక క్షణకాలం తన జీవితం ధన్యమైనట్లు భావించాడు. తాను ప్రాణాధికంగా ప్రేమించిన కంచి వరదరాజస్వామి సేవాభాగ్యం లభించినందుకు వరదయ్య మహానందం చెందాడు. మువ్వగోపాలుని తర్వాత తన దృష్టిని అంతగా ఆకర్షించినది వరదరాజస్వామివారే. వారు తనప్రియులు. తాను వారి ప్రియురాలు. ఆ

మధురభావనలో అతనా అవ్యయానందంచెంది పరవశించి పోయేవాడు.

కంచిలో వరదరాజస్వామిమీద వరదయ్య భక్తి పరాకాష్ఠ నందుకున్నది. అతడు గంటలతరబడీ ఆల యంలో ఏదో ఒకమూల స్తంభానికి ఆనుకొని ధ్యాన మగ్నుడై చలనరహితంగా కూర్చుండిపోయేవాడు.

## మరపురాని మధురానుభూతి :

ఒకరాత్రి స్వామివారి సేవలయాక అర్చకుడు ఆలయకవాటాలు బంధించి వెళ్లిపోయాడు. వరదయ్య అక్కడే నిశ్చల ధ్యాననిష్ఠలో వున్నాడు. అర్చకుడు అతన్ని చూడలేదు.

తెలతెలవారుతుండగా వరదయ్యకు స్మృతి వచ్చింది. కళ్లుతెరచి చూశాడు, స్వామిశయనమందిరం విడిచి వడివడిగా తన మందిరానికి తిరిగి వెళ్తూన్న దేవిని చూసి నట్లు తోచింది. ఆ అపూర్వదృశ్యం అతన్ని ఉత్తేజపరచింది.

గొజ్జంగపూలు తురిమిన ఆమె జడ విడిపోయింది. మెడ లోని కంటుసరి చిక్కుపడ్డది. విశాలనేత్రాల్లో నిదుర మబ్బులు క్రమ్ముకున్నాయి. నడక తడబడుతోంది. ఇరు వైపులా ఇరువురు చెలికత్తెలు కైదండలీయగా ఆమె మెల మెల్లగా అడుగులు వేస్తోంది.

ఆ అపూర్వసన్నివేశం నిర్మలమైన అతని హృదయం మీద చెరగని ముద్రవేసింది. వాస్తవికతాదృష్టితో ఆ మనోహరదృశ్యానికి అక్షరరూపం కల్పించకుండా వుండ లేకపోయాడు. వెంటనే అతని నోటివెంట మధురాతి మధురమైన పదం ఒకటి వెలువడ్డది.

మగువ తన కేళికామందిరము వెడలెన్
వగకాడ, మా కంచివరద! తెల్లవారె ననుచు— ॥ మ ॥

విడజారు గొజ్జంగి విరిదండజడతోను
కడు చిక్కువడి పెనగు కంటుసరితోను
నిదురకన్నులదేరు నిదురమబ్బుతోను
తొడరి పదయుగమున తడబడునడతోను— ॥ మ ॥

సొగసిసొగయని వలపుచూపులతోను

.... .... .... ....

ఇరుగడలకై దండలిచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వగోపాల తెల్లవారె ననుచు ॥ మ ॥

ఇది వరదయ్య జీవితంలో మరపురాని మనోహర సన్నివేశం.

## తంజావూరు ప్రయాణం :

మరునాడు ఉదయం అర్చకులు వరదయ్యను ఆలయంలోనే చూసి విస్మయపడ్డారు. అతడొక సుకృతాత్ముడనుకున్నారు. భగవంతునితో నేరుగా దివ్యానుబంధం కల్పించుకున్న మహాపురుషునిగా వారు భావించారు. వరదయ్య కంచిలో ఒకనెల మాత్రమే వున్నాడు. అతను కంచిలో వుండగా తంజనగరాధిపతి విజయరాఘవనాయకుల ఆహ్వానం అందింది. అతను వెంటనే తంజనగరి వెళ్లాడు.

## భ్రమరాలను కమలాలు పిలవాలా?

మదురై వెళ్లకముందే వరదయ్య తంజావూరు రాజ్యాధిపతి రఘునాథనాయకుని దర్శించాడు. ఏ కారణం చేతనో ఆ రాజు వరదయ్యను అంతగా ఆదరించక పోగా 'ఎందుకు వచ్చావ'ని ప్రశ్నించాడట. దీనికి వరదయ్య ఆగ్రహించవలసినదే. కాని అలా చేయక ఈ రీతిగా సమాధానించాడట.

> తముదా మెవత్తు రర్థులు
> క్రమమెటిగిన దాతకడకు, రమ్మన్నారా
> కమలంబులున్న చోటికి
> భ్రమరంబుల నచ్చుతేంద్ర రఘునాథనృపా!

వరదయ్య అక్కడ వుండలేదు. వెంటనే వెళ్ళిపోయాడు. కాని అతని పదవైభవాన్ని, మధురభక్తిని విని రసజ్ఞుడగు విజయరాఘవనాయుడు ఆహ్వానింపగా వరదయ్య మళ్లీ తంజావూరు వచ్చాడు.

**లలితకళలకు పట్టాభిషేకం :**

విజయనగరసామ్రాజ్యపు రోజుల్లోనే తెలుగుయోధు లెందరో దక్షిణదేశం వలసపోయి అక్కడ రాజ్యాలు స్థాపించి పరిపాలించారు. నాయకరాజు లట్టివారే. వారిలో రఘునాథ విజయరాఘవులు రసజ్ఞులు, మహా విద్వాంసులు, కళాపోషకులు. రఘునాథనాయకుని కొలువు సరస్వతికి కాణాచి. లలితకళలకు అక్కడ లభించినంత ఆదరం ఇంకా ఎక్కడా ఏ యుగంలోనూ ఏ ఆస్థానంలోనూ లభించలేదు.

కృష్ణదేవరాయల రాజ్యపతనానంతరం ఆదరించేవారు లేక కవులూ పండితులూ కళాకారులూ దక్షిణదేశం వలసపోయారు. కూచిపూడిభాగవతులకు రఘునాథ నాయకుడు 'అచ్యుతపురం' అనే అగ్రహారం ఇచ్చాడు. దాన్నే 'మేలట్టూరు' అని కూడా అంటారు. వారిలో కొందరు అక్కడే స్థిరపడిపోయారు.

## సరస్వతీభవనం :

రఘునాథనాయకుడు మహాకవి. చక్కని ప్రబంధాలూ నాటకాలూ వ్రాశాడు. ఒకవిధంగా తెలుగునాటక కళకు ఆయనే శ్రీకారం చుట్టాడనవచ్చును. ఆయన రాజప్రాసాదంలోనే ఒకనాటకశాల నిర్మించాడు. ఆయన తన జీవితసర్వస్వాన్నీ కళారాధనకోసం ధారపోసి తంజపురిని ఒకకళాతీర్థంగా తీర్చిదిద్దాడు. ఆ కళాతపస్వి తపఃఫలమే అచటి సరస్వతీభవనం.

## లక్ష్మీభవనం :

అదొక అపూర్వ విజ్ఞానమందిరం. విశ్వవాఙ్మయం అంతా అక్కడ సమీకృతమైవున్నదనడంలో ఆశ్చర్యం లేదు. ఆ రాజేంద్రునిహయాంలో అన్నికళల్లోనూ పురుషులతో పాటు స్త్రీలున్నూ తులతూగుతూ వుండేవారు. ప్రత్యేకించి స్త్రీల సారస్వతవ్యాసంగాలకు ఉద్దిష్టమైన లక్ష్మీభవనమే దానికి తార్కాణం.

## రఘునాథుని రమ్యాస్థానం :

రఘునాథనాయకుని ఆస్థానంలో మధురవాణి, రామభద్రాంబ, కృష్ణాజీ, రంగాజమ్మ మొదలైన ప్రసిద్ధ రచయిత్రులెందరో వున్నారు. రఘునాథనాయకుడు మధురవాణికి కనకాభిషేకంచేశాడు. ఆమె సుందర కాండం వరకూ రామాయణాన్ని సంస్కృతంలో రచించింది. అరఘడియలో నూరుశ్లోకాలు వ్రాయగల ప్రతిభ గలది ఆమె. ఆశువుగా అరుభాషల్లో రచనలుచేయగల దిట్ట. ఆయన మన్ననపొందిన మరొక రచయిత్రి రామభద్రాంబ. ఆమె పన్నెండు సర్గల్లో 'రఘునాథనాయకాభ్యుదయం' అనే సంస్కృతకావ్యాన్ని వ్రాసింది. కృష్ణాజీ అనే కవయిత్రి అడిగిన వృత్తంలో ఇచ్చిన సమస్యను పూరిస్తూ శ్లోకంచెప్పి దాన్ని తెనిగించేది. రంగాజమ్మ కూడ మహాకవయిత్రి. కాని ఏకారణంచేతనో ఆమె రఘునాథనాయకుని కాలంలో అంతగారాణించలేదు.

## తండ్రిని మించిన కొడుకు :

రఘునాథనాయకుని అనంతరం రాజ్యానికి వచ్చిన విజయరాఘవుడు సాహితీరంగంలో తండ్రికి మించిన తనయుడని పేరుపొందాడు. ఎందఱో కవులకూ కవయిత్రులకూ ఆశ్రయం కల్పించి నిరంతరం వారితో సంగీత సాహిత్యనాట్య విద్యావినోదాలతో కాలక్షేపంచేసేవాడు. వాస్తవానికి అతను చేసినంత సాహిత్యసేవ ఏరాజూచేయలేదు. అతని కాలంలో ఇతరులు రచించిన గ్రంథాలకంటె అతను స్వయంగా వ్రాసిన గ్రంథాలే యెక్కువ. యక్షగానాలుగాని, ప్రబంధాలు గాని ఇంకా ఇతరకావ్యాలు గాని ఆయన రమారమి నలభైదాకా వ్రాశాడని ప్రతీతి.

## విజయరాఘవుని విజయాస్థానం :

విజయరాఘవుల ఆస్థానంలో కాళయ్య్ర శతక్రతు మొదలైన మహాపండితులు, కవులూ ఎందఱో వున్నారు. ఆస్థానకవి కామరస వెంకటపతి సోమయాజి అనమాన

పాండితీ ప్రకర్షకలవాడు. ఆయన 'విజయరాఘవ చంద్రికావిలాసం' అనే నాటకాన్ని వ్రాశాడు. గొప్ప వాగ్గేయకారుడు. నాటిరచయిత్రులలో రంగాజమ్మ చాలా ప్రఖ్యాతివహించింది. ఆమె మహావిద్వాంసురాలు, ప్రముఖ నర్తకి. విజయరాఘవుని భోగపత్ని. విజయరాఘవుడు శృంగారలోలుడైనా మహాభక్తుడు. ఆయనకు 'మన్నారు దాసు అనేపేరుంది. విజయరాఘవుల విలాసాలను అభివర్ణిస్తూ రంగాజమ్మ 'మన్నారుదాసవిలాసం' అనే ప్రబంధాన్ని వ్రాసింది. విజయరాఘవుల ఆదేశంపై ఆమె తెలుగులో ఉషాపరిణయకథను కూడా కావ్యంగా వ్రాసింది.

## ఇతని ప్రతిష్ఠను దెబ్బతీయాలి:

రంగాజమ్మ వరదయ్య వంటి వాగ్గేయకారుణ్ణి చూడలేదు. అంచేత ఆమెకు అతనిమీద వల్లమాలిన అభిమానం ఏర్పడింది. అతని పదాలను ఆమె ఎంతగానో ఆదరించి అభినయించేది. కాని క్రొత్తగావచ్చిన ఒకపద

కర్తకు ఆస్థానంలో అంతటి గౌరవం లభించడం ఆస్థాన కవులకు కంటకంగావుంది. అతనిపై విజయరాఘవులకు ఏ విధంగా నైనా అనాదరభావం కలిగించాలనుకున్నారు. అతనిలో ఏవో దోషాలు వెదకడం మొదలుపెట్టారు.

## వరదయ్యపై వచ్చిన అభియోగం :

వరదయ్య తన పదాల్లో విజయరాఘవులను, 'నీవు' అనీ, 'ఏరా' అనీ సంబోధించేవాడు. అది ప్రభువు దృష్టికి తీసుకొనివచ్చి ఆయనకు వరదయ్య మీద ద్వేష భావాన్ని కల్పించవచ్చుననుకున్నారు. వరదయ్య తన పదాల్లో వాడే వ్యావహారిక భాష కూడా వారికి నచ్చలేదు. కవిత వుదాత్తంగా గంభీరంగా వుండాలని వారి వూహ. ఇంకా, అతని పదాలు అసభ్యశృంగారంతో నిండివుంటా యనీ, ప్రజానీకంలో సమున్నతభావాలను ప్రేరేపించ లేవని కూడా వారిభావన.

ఒకరోజున విజయరాఘవులు ఉల్లాసంగా వుండగా ఆస్థానకవులు మాటలసందర్భంలో వరదయ్యపై ధ్వజ

మెత్తారు. అతను ప్రభువును సంబోధించే తీరులోను, అతని పదాల్లోని వ్యావహారిక భాషాశైలి యెడలను తమకుగల అసంతృప్తిని వెల్లడించారు. వరదయ్య వారికి ఇలా సమాధానం చెప్పాడు.

## సరసమైన సమాధానం :

"ప్రభువుపై నాకు గౌరవంకంటె ప్రేమభావం ఎక్కువ....మానవుడుగా ఆయన నాకు ప్రేమపాత్రుడు. రాజన్యుడుగా గౌరవార్హుడు. నా పదాల్లో సంబోధించే టప్పుడు ఆయన్ను నేను మానవుణ్ణిగా గ్రహిస్తాను. నా దైవాన్ని కూడా నేను అదేరీతిలో సంబోధిస్తాను. దైవాన్ని గాని ప్రభువునుగాని నేను సంబోధించేతీరు వారిపట్ల నాకుగల నిర్మలప్రేమను స్ఫురింపజేస్తుంది,

ఇక నా భాషాశైలి అంటారా! నాది పదకవిత. కేవలం మేధావులకొఱకుద్దేశింపబడిన పద్యకవితలో వ్యావహారిక భాషాశైలికి విభిన్నమైన ఒక విశిష్టశైలి

వుండాలి. కాని నృత్యగీతాలకు వుద్దిష్టమైన పదకవితా శైలిమాత్రం అందరికీ అందుబాటులో వుండాలి. అది వాడుకభాషకు సంబంధించినదిగా దానికి సన్నిహితంగా వుండాలి. అంతమాత్రంచేత పదాలకు సాహిత్యగౌరవం వుండకపోదు. తప్పకుండా దానికొక విశిష్టతవుంటుంది. కృతకంగా ఆలంకారికంగా వుండే శైలికాక పదశయ్య సహజసుందరంగా సుబోధకంగా వుండాలని నా ఆశయం. ఇక నా పదాల్లోని శృంగారం సంగతి. శృంగారం నాకు కేవలం ఆలంబనం. కాని నా పదాలన్నీ మధురభక్తి ప్రేరితాలు. భౌతికవాంఛలకు దివ్యత్వాన్ని కల్పించడమే నా లక్ష్యం.'

## ఈ పదాన్ని పూరించండి!

వరదయ్య సమాధానం ప్రభువులకు ఎంతో చిత్తోల్లాసాన్ని కలిగించింది. ఆస్థానకవులకు వరదయ్య వివరణ అంత నచ్చకపోయినా తమ ఆక్షేపణలను సమర్థించుకునేందుకుగాని ఇంకా ఏవైనా వ్యాఖ్యలు చేయడానికిగాని సాహసించలేక వారు మౌనంగా వుండిపోయారు.

అనంతరం వరదయ్య అసంపూర్ణంగా ఒక పదం చెప్పి దాని చివర రెండుపాదాలు ఆస్థానకవులు పూరించేలా చెయ్యమని అర్థించి తాను సేతుయాత్రకు బయలుదేరాడు.

**మోహనాంగి కంచికి చేరింది :**

తానన్నప్రకారం వరదయ్య కాంచీనగరంలో వుండగా మోహనాంగికి కబురు పెట్టాడు. వరదయ్యపైనే ప్రాణాలు నిలుపుకొని వున్న మోహనాంగి ఆ శుభక్షణం కోసం వేయికళ్లతో ఎదురుచూస్తోంది. కబురందగానే ఆమె పరవశించిపోయింది. తన జన్మ చరితార్థమైనట్లు భావించింది. తమ్ముణ్ణి వెంటబెట్టుకొని కంచి చేరింది. వరదయ్యను చూడాలనే కుతూహలం కొలదీ ఆమె ఎకాయెకిని వరదరాజస్వామివారి ఆలయానికే వెళ్లింది.

కాని వారు కంచి చేరేసరికి దురదృష్టవశంచేత వరదయ్య కంచి వదలి తంజనగరం వెళ్లాడని విని ఆమె

క్రుంగిపోయింది. ఆలయాచార్యులు ఆమెకు ఎంతో ధైర్యం చెప్పారు. వరదయ్య తిరిగి వరదరాజస్వామి దర్శనార్థం రాగలడనీ అందాకా స్వామిని సేవిస్తూ అక్కడే వుండమనీ చెప్పి ఆమెకు వారు అన్ని వసతులు కల్పించారు.

## పదాలకు అభినయంతో ప్రాణంపోసింది :

ఆమె గుండె రాయిచేసుకొని క్షణమొక యుగంగా గడపుతూ వరదయ్యరాకకోసం ఎదురుచూస్తూ అక్కడ వుంది. ఆలయాధికారులు ఎంతో అభ్యర్థించగా ఆమె ఒక నాడు ఆలయప్రాంగణంలో వరదయ్య పదాలు ఒకటొక టొక్కటే అభినయించింది. ఆమె అభినయంలో మధుర భక్తి తొణికిసలాడుతూ వుంది. ఇదివరకు కంచిలో అందఱూ వరదయ్య తన పదాలను గానం చేస్తుండగా విన్నారు. కాని ఈనాడు మోహనాంగి ఆ పదాలకు నృత్య రూపం కల్పించి అభినయిస్తూ వుండగా చూచి రసావే శంలో వారు తన్మయులైపోయారు. ఆమె కదలికలూ కరచరణవిన్యాసాలూ వారికి అపూర్వంగా తోచాయి.

ఎంతో దివ్యానందాన్ని కల్గించాయి. ఆమె తన అభిన యంతో వ్యక్తంచేసిన ఆధ్యాత్మిక భావనలకు పండితులు పుప్పొంగిపోయారు. అందరూ ఆమెను ముక్తకంఠంతో ప్రశంసించారు. వరదయ్యమీద వారికేర్పడిన ప్రేమాభి మానములను అతని పరోక్షంలో మోహనాంగి మీద చూపడం మొదలుపెట్టారు.

ఒకరాత్రి తెలవారుతుండగా అమ్మవారు స్వామి శయనమందిరంనుండి వస్తూ ప్రత్యక్షంకాగా వరదయ్య ఆవేశంలో ఆమెను అభివర్ణిస్తూ ముగ్ధమోహనంగా ఒక అద్భుతపదం వ్రాశాడని ఆ పదాన్ని అతను గానం చేయగా విని అందఱూ పరవశించిపోయారని విని మోహనాంగి తన్మయం చెందిపోయింది.

## ఎక్కడ ఉండాలి ?

'వరదయ్య ఇప్పుడు కేవలం మువ్వగోపాలుని వరదుడే కాదు. విశాల ప్రపంచాని కంతటికీ చెందిన వర

దుడుగా పరిణతిని చెందాడు. కంచి అతన్ని తనవానిగా చేసుకుంది' అని ఆమె భావించింది. అతని రాకకోసం ఎదురుచూచి చూచి ఆమెకనులు కాయలుకాచిపోయాయి. అతని జాడకూడా ఏమీ తెలియరాలేదు. ఆమె ప్రాణా లన్నీ అతనిమీదనే వున్నాయి. అతని విరహం ఆమెకు దుస్సహం అయిపోయింది. కంచి ఆలయాచార్యులు ఎంతచెప్పినా వినక ఆమె తమ్ముణ్ణి వెంటబెట్టుకొని తంజా వూరు బయలుదేరి వెళ్లింది.

కాని ఆమెతోపాటు ఆమె దురదృష్టంకూడ వెంటా డింది. వారు తంజావూరు చేరిన కొద్దిరోజులకు ముందే వరదయ్య రామేశ్వరక్షేత్రానికి వెళ్లాడని విన్నది. ఆమె మీద పిడుగుపడ్డట్లయింది. ఆమె విలవిలలాడిపోయింది. అదో మహానగరం. ఎక్కడుండాలో ఏమి చెయ్యాలో ఆమెకు తోచలేదు. నిరాశాతప్తమైన తన హృదయానికి ఆశాకిరణం వరదయ్య దర్శనభాగ్యం ఒక్కటే. కంచి లోనూ తంజావూరులోనూ వరదయ్యను కలుసుకోలేక

పోవడంతో ఆమె హృదయం భ్రుంగిపోయింది. కంచిలో సహృదయులైన ఆలయాచార్యుల ఆదరాభిమానాలతో ఆమె తన స్వస్థలంలో వున్నట్లుంది.

## మెలకువతో మెలగాలి :

రాజాస్థానాన్ని దర్శించడానికి ఆమెకు మనస్కరించలేదు. ఆస్థానవాతావరణం ఆమెకు క్రొత్త. అక్కడి ఆడంబరం, పటాటోపం చూస్తే ఆమెకు ఒళ్లు జలదరించింది. క్రమంగా ఆచూకీ తీయగా తీయగా మహావిద్వాంసురాలు, ప్రఖ్యాతనర్తకీ అయిన రంగాజమ్మకు వరదయ్య అంటే అభిమానమనీ, తాను కలిసికోదగిన సరియైన వ్యక్తి ఆమేయనీ తెలిసింది, ఆస్థానకవులకు వరదయ్యకు మధ్య తలయెత్తిన వైరుధ్యాన్ని కూడా విన్నది. అంచేత ఆమె చాలా మెలకువతో వ్యవహరించాలనుకున్నది.

ఒక సాయంత్రం ఆమె రంగాజమ్మను చూడడానికి వెళ్లింది. తొలిసారిగా ఆమె ఒక ఆస్థానకాంతను చూస్తోంది.

అది ఆమెకు క్రొత్త అనుభవం. రంగాజమ్మ నిండుగా గంభీరంగా వుంది. ఆమె ముఖంలో ఔదార్యం, కరుణ ప్రస్ఫుటంగా కనబడుతున్నాయి. ఆమెను చూడగానే మోహనాంగికి ఆమెమీాద మంచి అభిప్రాయం యేర్పడ్డది. మోహనాంగి సహజసౌందర్యమూ, సరళస్వభావమూ రంగాజమ్మను ఇట్టే ఆకర్షించాయి. ఒక క్షణకాలం ఒకరి నొకరు ఱెప్పవాల్చకుండా ప్రేమపూర్వకంగా చూశారు.

## ప్రేమకు విరహం గీటురాయి :

మోహనాంగి రంగాజమ్మకు తన దీన గాథ అంతా పూసగుచ్చినట్లు చెప్పింది. రంగాజమ్మ ఆమెనోదారుస్తూ అన్నది.

"నీస్థితి నిజంగా నాకు జాలి కలిగిస్తోంది. నమ కాలీనుల్లో వరదయ్య లాంటి కవీ, గాయకుడూ లేడు. ఆయన పదాలు సకలజనాదరణ పొందాయి. అంతటి వాడు నీకు ప్రేమపాత్రుడు కావడం నీ అదృష్టం. ఈ

వియోగానికి నీవు విచారించకు. స్వచ్ఛ ప్రేమకు విరహం గీటురాయి లాంటిది. వరదయ్యపై నీకుగల ప్రేమ కాలపరీక్షకు నిలిచింది. ఆయన ఇక్కడకు తప్పక వస్తాడు. ఆస్థానకవులకు ఆయన ఒక పదం తాలూకూ తుది రెండు చరణాలు పూరణార్థం యిచ్చివెళ్లాడు. ఆయన తిరిగి ఇక్కడకు వచ్చేసరికి వారు ఆ పదపూరణ చెయ్యాలి. లేకపోతే ఓటమిని అంగీకరించాలి. నీవు నా ఆశ్రయంలో వుండి ఆస్థాన వినోదాలు చూస్తూ వుండు. నీకవి క్రొత్త. అయినా ఎంతోఅనుభవాన్ని గడించగలవు."

రంగాజమ్మ సహృదయానికి మోహనాంగి సంతోషించింది. రంగాజమ్మకు తన కృతజ్ఞతను తెలుపుకుంది. ఆమె తన తమ్మునితో కలిసి అక్కడే హాయిగా వుంది.

## శ్రీరంగవైభవం:

తంజావూరు విడచిపెట్టిన తర్వాత వరదయ్య శ్రీరంగం వెళ్లాడు. ఆ ఆలయవైభవం చూసి అతను ఆశ్చర్య

చకితుడయ్యాడు. అది సప్తప్రాకారాల మధ్య ఒక మహా నగరంలావుంది. అచ్చట వేయికాళ్ళమండపం, బంగారపు పూతతో మెరుస్తూన్న ఆలయోపరిభాగం, ఏకవింశతి శిఖరాలు వరదయ్యకు చెప్పలేని ఆనందాన్ని కలిగించాయి. పండితులు ఆలయంలో నిరంతర వేదగానం చేస్తూవుంటారు. ఆ దృశ్యం అతనికి రోమాంచం కలిగించింది. ఆలయ వాతావరణం ప్రసన్నంగా పవిత్రంగావుంది. అత్యంత విశాలంగా అసాధారణ శిల్పకళతో కనువిందుచేస్తున్న ఆలయప్రాంగణం కలియుగ వైకుంఠమన్నట్లుంది.

వరదయ్య ఆలయంలో అడుగుపెట్టి శేషశాయి అయిన శ్రీరంగనాథుణ్ణి దర్శించాడు. ఆ మనోహరదృశ్యం వరదయ్యను దివ్యానందంలో ముంచెత్తింది. క్షణకాలం అతను ఈ భౌతిక ప్రపంచాన్నే మరచి పోయాడు. ఆ స్థలవైభవము, ఆ ఆలయ సౌందర్యం అతని హృదయాన్ని ఉత్తేజపరిచాయి. అతను శ్రీరంగంలో కొన్నాళ్ళు స్వామిని సేవిస్తూవున్నాడు. స్వామి మీద కొన్ని పదాలు కూడా చెప్పాడు.

## రామేశ్వర రామణీయకత :

అనంతరం వరదయ్య రామేశ్వరం వెళ్ళాడు. ఆ మహాక్షేత్రాన్ని దర్శించాలని అతను ఎన్నాళ్ళనుండో ఉవ్విళ్లూరుతున్నాడు. ఉత్తరాన వారణాశి, దక్షిణాపథంలో రామేశ్వరం జగత్ప్రసిద్ధిగన్న మహాక్షేత్రాలు. అక్కడి శివ లింగాన్ని శ్రీరాముడు ప్రతిష్ఠచేశాడని ప్రతీతి. వరదయ్య సేతుస్నానం చేసుకొని ఆలయంలోనికి వెళ్లాడు.

శివలింగం అద్భుతంగావుంది. చిత్రకళాశోభిత మైన ఆలయము. లెక్కింపనలవికాని స్తంభాలతో అపూర్వంగా వున్న ఆలయాంతర వీధులు అతన్ని పరవ శింపజేశాయి. అంతటి మహాక్షేత్రాన్ని దర్శించగలిగి నందుకు అతను మహానందభరితుడయ్యాడు.

## మొవ్వ మనసులో మెదిలింది :

అతను మువ్వవిడిచి వచ్చి చాలాకాలమైంది. అతని ధ్యానం తిరిగి మొవ్వగోపాలుని మీదికి వెళ్లింది. తిరిగి

వెళ్లి తన స్వామిని దర్శించాలనే ప్రగాఢమైన కోరిక కలిగింది అతనికి. ఆవేశంతో అప్పటికప్పుడు కొన్నిపదాలు రచించాడు. అతను రామేశ్వరంలో ఒకనెలపాటు గడి పాడు. తంజావూరు వదలివచ్చి అప్పటికి రమారమి ఆరు నెలలైంది. ఆస్థానకవులు తానిచ్చిన పదం పూరించారో లేదో అనుకున్నాడు. తుదకు రామేశ్వరం నుండి తంజా వూరు వెళ్లి అక్కడనుండి మిగిలిన క్షేత్రాలుచూసు కుంటూ గోల్కొండ మీదుగా తిరిగి మొవ్వవెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

## మోహనాంగి తహతహ :

మోహనాంగి ఆరునెలలుగా తంజావూరులో వుంది, రంగాజమ్మ ఆశ్రయంలో ఆమెకు కాలంగడచిపోతూన్నట్లే కనబడలేదు. అయినా ఆమె హృదయం అహర్నిశలూ వరదయ్య కోసం తహతహలాడుతూ వుండేది. మువ్వ గోపాలుని అనుగ్రహాన్ని అర్థిస్తూ ఆయన్ను పదే పదే వేడు కునేది. జానపదవాతావరణంలోని సరళసుందర జీవితానికి

తాను దూరమైపోయింది. ఆమె మనస్సెప్పుడూ ఆ ఆనంద మయ జీవితంమీదనే వుండేది. వరదయ్యతో కలిసితిరిగి మొవ్వవెళ్లి హాయిగా మువ్వగోపాలుణ్ణి సేవిస్తూ ప్రశాంతంగా జీవితం గడపాలని ఆమె ఆకాంక్ష. వరదయ్య రాకకోసం ఆమె మనస్సు బిగబట్టుకొని ఎదురుచూస్తూ క్షణం ఒక యుగంగా గడుపుతోంది.

## శృంగభంగం తప్పదు :

ఒకరోజు సాయంత్రం రంగాజమ్మ మోహనాంగితో అన్నది, "ఇటీవల రామేశ్వరంనుండి కొందరు యాత్రికులు వచ్చారు. వరదయ్య ఒకవారంలో తిరిగి తంజావూరు రాగలడన్నారు. కనుక నీవు విచారంమాని వుల్లాసంగావుండు. నాతో ఆస్థానానికి వచ్చి వరదయ్య పదాలు అభినయంచెయ్యి. వరదయ్య ఆస్థానకవులకు ఇచ్చిన పాదపూరణ కోసం వారందఱూ తమ శక్తి యుక్తులన్నీ వినియోగించిచూశారు. కాని వారికేమీ అంతుచిక్క లేదు.

ఎలా పూర్తిచెయ్యాలో తెలియలేదు. వారికి అదంతా అయోమయంగావుంది. వారికి శృంగారనాయికల మనోగత భావాలు ఎలావుంటయ్యో తెలియదు. వారు నా సహాయాన్నికూడా అర్థించారు.

వరదయ్య అలంకారశాస్త్రం కూలంకషంగా అధ్యయనంచేసి జీర్ణించుకున్నవాడు. ఎంతో లోకానుభవం కలవాడు. అతను తన పదాల్లో వర్ణించిన నాయికలు కాల్పనికంగా కృతంగా కాకుండా అనురాగపూర్ణలైన వాస్తవిక నాయికల్లాగా గోచరిస్తారు. ఆ నాయికల మనోభావాలు తెలిసికొనడానికి కేవలశాస్త్రజ్ఞానం చాలదు. అంచేత నేనూ వారికి ఏమీ సాయపడలేకపోయాను. వరదయ్య మీద ద్వేషభావంతో వారు లేనిపోని బెడద తెచ్చిపెట్టుకున్నారు. వారందఋా ఇపుడు ఆ పదాన్ని ఎలా పూర్తి చెయ్యాలో తెలియక కొట్టుకుంటున్నారు. వారికి వరదయ్య చేతుల్లో శృంగభంగం తప్పదు."

**మోహనాంగి ముగ్ధ మోహనాభినయం :**

రంగాజమ్మ మాటలకు మోహనాంగి మహానందం చెందింది. ఆమెతోపాటు ఆస్థానానికి వెళ్లి క్షేత్రయ్య పదాలు అభినయించడానికి అంగీకరించింది. రంగాజమ్మ సంతోషించింది. ఆమె మోహనాంగిని నర్తనోచిత వస్త్రా భూషలతో అలంకరించింది. సహజంగా మోహనాంగి రూపసి. కొద్దిపాటి అలంకరణతో ఆమె అప్సరసలా మెరిసి పోయింది. ఇద్దఱూ ఆస్థానానికి వెళ్ళారు. ఆనాడు మోహనాంగి పదాభినయం చేస్తుందని విని విజయరాఘ వుడు ఆనందించాడు. రంగాజమ్మ చెప్పగా మోహనాంగి వృత్తాంతం ఇదివరకే విన్నాడు విజయరాఘవుడు. వర దయ్య పదాలను రంగస్థలంమీద అభినయిస్తుండగా చూడాలని తానూ కుతూహలంతో వున్నాడు.

మోహనాంగి నాట్యం ఆరంభించింది. మూడేండ్ల నుండి అభినయించని కారణంచేత కొంచెం అలవాటు తప్పింది. అదీకాక ప్రభుసమక్షంలో ఉద్దండ పండితులూ,

కవులూ, నర్తకులు చూస్తుండగా అభినయించడానికి ఆమె కొంచెం వెనుకంజవేసింది. కాని వెంటనే ఎలాగో ధైర్యం కూడగట్టుకొని అసాధారణరీతిలో అతిమోహనంగా అభినయించడం మొదలుపెట్టింది. ఆమె వరదయ్యపదాభినయంలో లీనమైపోయింది. ఆమె చూపుల్లో దివ్యానందం మెరిసిపోతోంది. పదాభినయానికి అన్ని విధాలా అనుగుణంగావున్న ఆమె కరచరణాల కదలికలూ, ఆ పదాల్లోని దివ్యభావనను స్ఫురింపజేసే హావభావాలూ, దృగ్విలాసాలూ ఆమె నాట్యానికి ఒక ప్రత్యేకతా ఒక విశిష్టతా కల్పించాయి. నయనాభిరామంగావున్న మోహనాంగి అభినయాన్ని విజయరాఘవుడు ఎంతో ఆహ్లాదంతో చూస్తున్నాడు. ప్రేక్షకులందఱూ మైమరచి ఎక్కడో మరోలోకంలో వున్నట్లున్నారు.

## మరపురాని మధురక్షణం :

ఇంతలో సభలో కలకలం బయలుదేరింది. వరదయ్య ఆస్థానంలో అడుగుపెడుతున్నాడు. విజయరాఘవుడు వరదయ్యను చూసి మహానందభరితుడయ్యాడు.

వరదయ్య మోహనాంగిని అభినయం చేస్తుండగా చూసి పులకించిపోయాడు. మోహనాంగి బిత్తరపోయి వరదయ్యను చూస్తూ నిలబడిపోయింది. ఆమె కళ్ళల్లో ఎన్నాళ్ళనుంచో నిలిచివున్న ఆతురత పెల్లుబికినట్లయింది. కాని హర్షావేశంతో ఆమె నోటివెంట మాటరాలేదు. ఆమె కళ్ళవెంట ఏకధారగా ఆనందబాష్పాలు స్రవించాయి. ఆవేశంతో ఆమె పులకించి పోయింది. తన అనురాగాన్ని వ్యక్తం చేస్తూ వరదయ్య ఆమె చేతిని మృదువుగా స్పృశించాడు. ఇరువురకూ అది ఒక మరపురాని మధురక్షణం.

## పదపూరణం వరదయ్యే చేయాలి :

అనంతరం వరదయ్య ఆస్థానకవులకు తానిచ్చిన పదాన్ని పూరించారేమో తెలిసికోవాలని కుతూహల పడ్డాడు. ప్రభువు ఆస్థానకవులవంక సాభిప్రాయంగా చూశాడు. వారు గతుక్కుమన్నారు. తికమక పడ్డారు. ఎవ్వరూ ఏమీ అనలేదు. పట్టుపుకవి సోమయాజి లేచి అన్నాడు.

"వరదయ్య తన పదంలో అభివర్ణించిన నాయిక ఏ శ్రేణికి చెందిందో ఆమె మనోభావాలు ఎలావుంటాయో తెలుసుకోవాలని మేం మాసర్వశక్తులూ వినియోగించాం. కాని అవి మా వూహకు అందలేదు. స్త్రీహృదయం స్త్రీకి అవగతం కావచ్చనే వూహతో మహావిద్వాంసురాలైన రంగాజమ్మను కూడా సంప్రదించాం. కాని అతిలోక ప్రతిభాసంపన్నుడైన వరదయ్య మనోగతభావం తెలుసు కోవడం అంతసులభంకాదని ఆమె కూడా భావించింది. కనుక ఆపదపూరణ వరదయ్యనే చేయమని అర్థిస్తున్నాను."

## వరదయ్య ఇచ్చిన పదం:

వరదయ్య ఆస్థానకవులకు పూరణార్థం ఇచ్చిన పదం ఇది.

పల్లవి: వదరక పోపోవే - వాడేల వచ్చిని - వద్దు
రావద్దనవే

అనుపల్లవి: అదియొక యుగము వేరేజన్మ మిపుడు
అతడెవరో నే నెవరో ఓ చెలియరో ॥ వదరక ॥
నిచ్చనిచ్చలు నేడేవచ్చీని - రేపైన వచ్చేననుచు
మదిలో
నిచ్చగా బలు వేడినిట్టూర్పులచేత నింతిరో
పెదవులెండి
హెచ్చైన వెన్నెలరాత్రులు యెన్నెన్నో గడపితి
నిక నేటిమాటులే ॥ వదరక ॥

వలపుకాడిదికాదా వచ్చుననుచు తెరువులుజూచి
వేసారితి
నెలలెంచి యలసితి - నిలుపరాని ప్రేమ.
నెమ్మది నడచుకొంటి
కలకంఠ పికనాదములు మించు మధుమాస
ములు గడపి తీవట్టి ముచ్చటలికనేలే ॥ వదరక ॥
భామరో! శకునము లడిగితి మువ్వగోపాలుడు
వచ్చుననుచు

కామించి నాథుల గలయు చెలులజూచి -
కరగి చింతనొందితి

....        ....        ....        ....

....        ....        ..        ....

చివరి రెండుపాదాలు పూరించవలసి యున్నది. ఈ పదంలోని నాయిక స్వీయ. పతి యెంతకూ రాని హేతువుచేత ఆమె విరహంతో విసిగివేసారిపోయింది. ఎన్నో శకునాలడిగింది. ప్రియులతో కలిసి కేళీవిలాసాల్లో తేలియాడుతూన్న యితర కాంతలను చూసింది. కాని ఎందుచేతనో హృదయం ద్రవించి ఆమె విచారించింది.

తర్వాత ఏం జరిగుంటుంది? ఆమె ఏం అని వుంటుంది? చివరి రెండుపదాలూ ఆ భావంవచ్చేలా పూరించాలి.

## అపహాస్యం పాలౌతామేమో!

సామాన్యంగా ఆ స్థితిలో ఎవరికైనా ఆగ్రహం కలగవచ్చు. ప్రియునియెడల పట్టరాని కామోద్రేకమైనా కలగవచ్చు. లేదా నిస్సహాయస్థితిలో ఏమీ చేయలేక పరిస్థితులకు మౌనంగా తలొగ్గనూవచ్చు. ఈ మూడింటిలో నాయికకు ఎటువంటిభావచలనమైనా కలగవచ్చు. ఆస్థాన కవులు అయినా వూహించి పూర్తిచేద్దామనుకున్నారు ముందు. కాని వెంటనే 'అలాంటి వూహ' సర్వసాధారణం. అందులో విశేషమేమీ లేదు. అలా అయితే ఎవరైనా పూరించగలరు. వరదయ్య అంతటి సులభసమస్య ఎన్నడూ ఇవ్వడు. సామాన్యమైన వూహకు అతీతమైన విశేషార్థమేదో అందులో వుందివుంటుంది అని శంకించారు. వారికేమీ పాలుపోలేదు. అవ్యక్తంగా ఏదో పూరించి అపహాస్యపుపాలయ్యేదానికంటె ఓటమిని అంగీకరిస్తేనే ఉదాత్తంగా వుంటుందనుకున్నారు. అంచేతనే ఆస్థానకవులపక్షాన సోమయాజి తమ అశక్తతను వ్యక్తం చేస్తూ పదాన్ని పూరించమని వరదయ్యను అర్థించాడు.

## వరదయ్య పదపూరణం:

వరదయ్య వెంటనే లేచి ఇలా పూరించాడు.

'రామ! రామ! యీ మేనితో నిక వాని
మోముచూడవలెనా మొదటి పొందేచాలు.'

ఆస్థానకవులు ఆశ్చర్యచకితులై ఒకరిముఖం ఒకరు చూసుకోడం మొదలుపెట్టారు. ఆ పదభావం వారికి అంతగా అర్థంకానట్టుంది. అది గ్రహించి వరదయ్య ఇలా అన్నాడు—

'ఇందులోని నాయికయొక్క ప్రేమ భక్తిపరమైనది, కాని భౌతికమైనదికాదు. తాను చూసిన ఇతరకాంతలప్రేమకంటె అది విభిన్నమైనది. వారిలాగా తానూ గోపాలునివలన భౌతికప్రేమను ఆశించడంలో ఔచిత్యంలేదు. అంచేత ముందు ఆమె నిరాశచెందినా తుదకు తెలివితెచ్చుకొని పశ్చాత్తాపంతో తన మనస్సును సమాధానపరచుకుంది. మువ్వగోపాలుని తన తొలి కూటమియే పదివేలనుకుంది. అదే చాలనుకుంది.'

## వరదయ్య పదాల ఒరవడి :

ఆస్థానకవులు వరదయ్య సూక్ష్మబుద్ధికి నివ్వెఱ పోయారు. దివ్యభావనలో ఇంతటి ఉదాత్తంగా వివిధ దృక్పథాలనుంచి స్త్రీ స్వభావాన్ని వ్యక్తంచెయ్యగల వరదయ్య అసాధారణ శక్తిసామర్థ్యానికి వారు జోహారు లర్పించారు. విజయరాఘవుడూ, ఆస్థానకవులూ కూడా ఆయన పదవైశిష్ట్యాన్ని వేనోళ్ల ప్రశంసించారు. అంతే కాక వారు క్రమంగా వరదయ్యదారినే త్రొక్కి తమ గ్రంథాల్లో కూడ పదరచనకు స్థానం కల్పించారు. సోమయాజి తన నాటకం 'విజయరాఘవ చంద్రికా విహారం' లో వరదయ్య పదాలను అనుకరిస్తూ ఎన్నో పదాలు వ్రాశాడు. వాటిని చదువుతూ వుంటే అవి క్షేత్రయ్య పదాలనే భ్రమకూడ కలుగుతుంది. విజయ రాఘవుడుకూడా అలాగే ఎన్నో పదాలు వ్రాశాడు.

## కలలు ఫలించాయి :

కొన్నాళ్ల తర్వాత వరదయ్య మువ్వ తిరిగివెళ్లి పోవాలని నిశ్చయించుకుని విజయరాఘవుల అనుజ్ఞ

కోరాడు. విజయరాఘవుడు అతికష్టంమీద వరదయ్య వేడుకోలు మన్నించాడు. తుదిరోజున విజయరాఘవుల అభ్యర్థనపై మోహనాంగి 'వదరక పోపోవే' అనేపదాన్ని అభినయించి అందరినీ ఆనందంలో ముంచెత్తింది. తన పదాలద్వారా మువ్వగోపాలునకు మహనీయతను కల్పించాలని తాను కన్నకలలు చాలామటుకు ఫలించినందుకు వరదయ్య ఆనందించాడు. అందఱినీ హృదయపూర్వకంగా అభినందిస్తూ అతను మోహనాంగితో తంజావూరు సంస్థానంవిడిచి బయలుదేరాడు.

## నిజమైన అంతేవాసివి :

వరదయ్య తంజావూరునుండి గోల్కొండకు ప్రయాణమయ్యాడు. కాని యెకాయెకిని గోల్కొండ వెళ్ళకుండా కంచి వెళ్లి వరదరాజస్వామిని మరోసారి సేవించాలని భావించాడు. అంచేత కంచికి వెళ్లాడు. అక్కడ వారిద్దఱూ తనివితీరా స్వామిని సేవిస్తూ కొంత కాలం గడిపారు.

కంచి ఆలయాచార్యుల అభ్యర్థనపై వరదయ్య దేవేరి స్వామిశయనమందిరం నుండి తన మందిరానికి వెళ్తూన్న దృశ్యాన్ని అభివర్ణిస్తూ వ్రాసిన 'మగువ తన కేళికామందిరము వెడలెన్' అనే పదాన్ని మోహనాంగి వరదరాజస్వామి ఆలయప్రాంగణంలో అద్భుతంగా అభిన యించింది.

ఆ పదం వరదయ్య పదకవితాహారానికి నాయక మణిలాంటిది. దేవి తత్తరపాటుతో కేళికామందిరం నుండి వస్తూన్నప్పటి భంగిమను మోహనాంగిఅతిలోకమోహ నంగా ప్రదర్శించింది. వరదయ్య ఉత్తేజంతో రచించిన ఆ పదం మోహన అభినయంతో జీవం సంతరించుకొని ఎంతో కళాత్మకంగా తోచింది. ఆమె ఒకక్షణం తాను అభినయిస్తూన్నాననే విషయమే మరచిపోయింది, తానే దేవేరిని అనుకుంది. తాను సృజించిన పదానికి మోహన తన దివ్యాభినయంతో ఒక సజీవరూపకల్పన చేసినందుకు వరదయ్య తన్మయత్వం చెందిపోయాడు. తన పదా

ల్లోని నిగూఢమైన దివ్యభావన హృదయగతం చేసుకొ
అభినయించగల విజ్ఞత ఆమెకొక్కర్తికే వుందని, అ
కేవలం ఆమె సొమ్మనీ విశ్వసించాడు. ఆమె తనకు ని
మైన అంతేవాసిని. సహధర్మచారిణి. మోహన మోహ
కారం, అతిలోకమైన ఆమె అభినయం, వరదయ్య గా
మాధురి ప్రేక్షకుల హృదయాలను కదలించి రసా
దంలో ముంచెత్తాయి. వారందరూ ఎక్కడో గంధ
లోకంలో రసానిలంలో తేలిపోతున్నట్లు భావించారు.

వారందఱూ వరదయ్యకూ మోహనాంగికి ము
కంఠంతో ధన్యవాదాలర్పించారు. వరదయ్య వారి అ
రాభిమానాలకు ముగ్ధుడై వారిని వేయివిధాల ప్రశంసి
గోల్కొండకు బయలుదేరాడు.

## మువ్వగోపాలునిలో సాయుజ్యం పొందాలి :

ప్రఖ్యాత పదకర్తగా క్షేత్రజ్ఞ బిరుదాంకితుడు
వరదయ్య కీర్తిచంద్రికలు అదివరకే గోల్కొండ వ్యా
చాయి. వరదయ్య లోగడ గోల్కొండ వచ్చినప్పు

తాను తన తిరుగుప్రయాణంలో మళ్లీ గోల్కొండ వచ్చి కొన్నాళ్లుంటానని మాటయిచ్చాడు. అంచేత నవాబు కుతుబ్షా వరదయ్య రాకకోసం కుతూహలంతో ఎదురు చూస్తున్నాడు. కుతుబ్షా కళాప్రియుడు, రసజ్ఞుడు. ఆయన ఆస్థానంలో ఎందరో వాగ్గేయకారులున్నారు. అయినా 'ఆయనకు వరదయ్యమీద అంతులేని ఆదరాభి మానాలేర్పడ్డాయి.

వరదయ్య తాను అన్నప్రకారం గోల్కొండ వచ్చాడు. నవాబు చాలా సంతోషించాడు. అతనికి అఖండ సన్మానం చేశాడు. తన ఆస్థానంలో శాశ్వతంగా వుండి పొమ్మని కోరాడు. కాని క్షేత్రయ్య అంగీకరించలేదు. మువ్వగోపాలుని మహిమను 'కీర్తనంచేస్తూ తానింకా కొన్ని క్షేత్రాలు దర్శించాలనీ తుదకు మొవ్వ తిరిగివెళ్లి మొవ్వగోపాలునిలో సాయుజ్యం పొందాలనీ తన అభి మతమని అన్నాడు. నవాబు కాదనలేకపోయాడు.

**అటువంటి ఆత్మప్రత్యయం ఉండాలి :**

నవాబు ఆస్థానంలో తులసీమూర్తి అనే వాగ్గేయ కారు డున్నాడు. అతను మంచి పండితుడు. కాని తన శక్తిమీద తనకు అంత విశ్వాసం లేదు. ధీమాగా కవిత చెప్పలేడు. అంచేత నవాబు ఒకరోజున అతన్ని వుడికించ డానికి ఇలా అన్నాడు:

'తులసీమూర్తీ! క్షేత్రయ్య అప్రయత్నంగా ఆశువుగా ఎంతవేగంతో పదరచనచేస్తాడో చూడు. నీవుకూడా అలా పదాలు చెప్పాలని నా కోరిక.'

నవాబు మాటలకు మూర్తి తత్తరపడ్డాడు.

'క్షేత్రయ్య దివ్యశక్తిసంపన్నుడు. ఆయనలో వుత్తేజం కల్పించడానికి ఆయన వెనుక మువ్వగోపాలు డున్నాడు. ఆయనలాగా పదరచన చెయ్యడం అంత లంతలకు సాధ్యంకాదు' అన్నాడు నీళ్లునములుతూ.... మూర్తి ఎప్పటికప్పుడు తనఅశక్తతను ప్రకటించి తప్పించు

కునిపోవాలని చూస్తాడు. అంచేత నవాబు అతన్ని కొంత ఆటపట్టించాలనుకున్నాడు. పోనీ తన కవితా శైలిని సమర్థించుకుంటూ వాదానికి దిగుతాడా అంటే అదీచేయడు. ప్రతీదానికి వూరికే లోబడిపోతాడు. మూర్తి ఆ రీతిగా స్తబ్ధుగా వుండడం నవాబుకు ఇష్టం లేదు. చురుగ్గా క్రియాశీలంగా వుండాలని ఆయన కోరిక.

ఆయన క్షేత్రయ్యవంక చూసి అన్నాడు.

"క్షేత్రయ్యా! మాకు నీ శక్తిసామర్థ్యాలు తెలుసు. వాగ్గేయకారుల్లో నీకు సాటిరాగలవారెవ్వరూ లేరు. నిన్ను పరీక్షింపదగ్గ అధికారంగాని అర్హతగాని మాకు లేదు. అయినా ఒక విశిష్టమైన ఆశయంతో నిన్నొక విషమ పరీక్షకు గురిచేయాలనే వూహ కలిగింది. నీవు నలభై రోజులలో పదునైదువందల పదాలు రచించాలి. వాస్తవంగా నిన్ను పరీక్షించాలనికాని, నీకు అహేతుకమైన వ్యథ కల్పించాలనికాని నా అభిమతంకాదు. కాని నాయీ

యత్నం నా ఆస్థానకవులకు ఉద్వేజకంగావుండి వారిలో నవచైతన్యాన్ని కలిగిస్తుందేమోనని నా అభిలాష. అంచే తనే నీమీద ఈ మహాభారం మోపుతున్నాను. నన్ను మన్నించాలి."

క్షేత్రయ్య చలించలేదు. నవాబుచేసిన సవాలును సహర్షంగా అంగీకరిస్తూ "మువ్వగోపాలుని అనుగ్రహాతిశయంతో మీరుపెట్టిన గడువులోపల పదునైదువందల పదాలు రచిస్తా" నన్నాడు.

నవాబు మూర్తివంక నర్మగర్భంగా చూస్తూ "మూర్తీ! వాగ్గేయకారులకు అటువంటి ఆత్మప్రత్యయం భావావేశం వుండాలయ్యా" అన్నాడు.

## ఎలాగైనా శృంగభంగం చేయాలి:

ఆ రాత్రి మూర్తికి నిద్రపట్టలేదు. ఆస్థానంలో నలుగురియెదుట నవాబు తనను అవమానపరచినందుకు అతనికెంతో మనోవ్యథ కలిగింది. వరదయ్యమీద

అతనికి స్పర్ధ ఏమీలేదు. అయినా ఆయనమూలాన తాను అనవసరంగా ఇరకాటంలోపడి అవమానంపాలు కావాలిసివచ్చిందనుకున్నాడు. నవాబును కీర్తిస్తూ ఏవో పద్యాలు వ్రాసి ప్రశాంతంగా కాలంగడిపేవాడు. కాని క్షేత్రయ్యరాకతో అతనికి తలవొంపులు కలిగాయి. నిర్ణీత సమయంలో క్షేత్రయ్య పదరచన పూర్తిచేయకుండా ఏదైనా అవరోధం కల్పించి అతనికి శృంగభంగం చేస్తే తనపరువు నిలుస్తుందనీ లేకపోతే నవాబు ఇంకా తనను అవమానపరుస్తాడనీ భావించాడు.

## పదరచన పూర్తిగాకుండా చూడు:

మూర్తి దీనికితగ్గ వుపాయంకోసం ఆలోచించడం మొదలుపెట్టాడు. తుదకు అతనిదృష్టి రాజనర్తకి కమల మీదికి మళ్లింది. ఆమె తనకు తోడ్పడగలదనుకున్నాడు. వరదయ్య లోగడ గోల్కొండ వచ్చినప్పుడు ఆమె వరదయ్యను వలచి అతనివెంటబడడం, ఆయన ఆమె

కోర్కెను తిరస్కరించి అవమానించడం అతనికి గుర్తుకు వచ్చింది. వెంటనే అతను కమల యింటికి వెళ్లి ఆమెతో మంతనం సాగించాడు. ఎలాగైనా అతన్ని లోబరచు కొని అతని మతిని చెడగొట్టి నవాబు పెట్టిన గడువు లోపల పదరచన పూర్తిచెయ్యకుండా చూడాలని అర్థించాడు.

## నన్ను కృతార్థురాలిని చేయండి:

కమలకు వరదయ్యమీద ఇంకా వ్యామోహం పోలేదు. అతన్ని తన బాహుబంధంలో చిక్కించుకొనడం ఎలాగా అని ఆమె సమయంకొఱకు నిరీక్షిస్తోంది. ఇప్పుడు మూర్తి సలహాను అనుసరించి తనకోర్కె తీర్చు కోవచ్చు లేదా అతనిపై పగనైనా సాధించవచ్చు అను కుంది. క్షేత్రయ్యకు అనుమానం కలగకుండా అతన్నితన దారికి రప్పించుకొనడానికి ఉపాయం ఆలోచించడం మొదలుపెట్టింది.

ఒకనాడు వరదయ్య నవాబుతో అంతరంగికసమా వేశం జరిపి వంటరిగా తన విడిదికి బయలుదేరాడు. కమల యెదురై నమస్కరించి, 'స్వామీ! మీ ప్రతిభ విన్నాను. అజ్ఞానవశంచేత లోగడ మీమీద భౌతిక వాంఛ పెంచుకుని మీ మనస్సుకు కష్టంకలిగించినందుకు క్షంతవ్యురాలను. మీరు ఈరోజు మా యింట్లో క్షణ కాలంవుండి నన్ను కృతార్థురాలిని చెయ్యాలి' అని అర్థించింది.

## అంతా ప్రేమమయం:

తొలిసారి గోల్కొండవచ్చినపుడు వరదయ్య మన స్థితివేరు. అతని ఇప్పటి మనస్థితివేరు. పరిణతమైన అతని మనస్సులో ఇప్పుడు ఏవిధమైన శంకకు తావులేదు. అతనికి జగత్తంతా ప్రేమమయమే. ఇన్నాళ్లుగా తాను అనేకక్షేత్రాలు, ఆస్థానాలు తిరిగి మువ్వగోపాలుని మహ నీయతను కీర్తించడంద్వారా తన నిర్మల ప్రేమతత్వం విజయవంతమైనదని అతని విశ్వాసం. ఇప్పుడా ప్రేమ

తత్వాన్ని సమస్తప్రాణికోటిపట్ల విస్తృతం చెయ్యాలని అతని యత్నం. ఆ సమయంలో అతనిలో ప్రబలంగా వున్న ఉదాత్తప్రకృతి అది. అంచేత కమల అభ్యర్థన త్రోసివేయలేకపోయాడు.

**ఇతణ్ణి ఆడించాలి :**

ఆమెయింట్లో అడుగుపెట్టాడు. ఆమె అతనిపట్ల ఎంతోభక్తిని ప్రకటించింది. సకలోపచర్యలు చేసింది. చివరకు ఫలరసంలో చాటుగా వలపుమందుకలిపి అందించింది. క్షేత్రయ్య ఏమీ సంకోచించకుండా ఆ రసం త్రాగాడు. ఆ మందు వెంటనే పనిచెయ్యడం మొదలు పెట్టింది. అతను తనలో ఏదో మార్పువస్తున్నట్లు గ్రహించాడు. అక్కడినుండి వెళ్లిపోవాలనుకున్నాడు. కాని అతని మనస్సు అతనివశంలో లేదు. అలాగే కూర్చున్నాడు.

కమల అతనివంక వలపులుచిమ్ముతూ చూసింది. తన రాసికాన్ని ఒలకపోస్తూ అతన్నివశపరచుకోవాలని

యత్నించింది. ఆమె ఇంచుమించు అతనిమీద వ్రాలింది. అపుడామె అతనిదృష్టికి ఒక అప్సరలా గోచరించింది. అయినా తమాయించుకుని అక్కడినుండి కదలిపోవాలని యత్నించాడు. కాని వెంటనేలేచి వెళ్ళలేకపోయాడు. కొంత తాత్సారం చేశాడు.

కమల అతనిలో వస్తున్న మార్పు గ్రహించింది. వెంటనే అతనికి లోబడకూడ దనుకున్నది. తానిచ్చిన వలపుమందుయొక్క ప్రభావంవల్ల ఇక అతను తనకు వంటయింటికుందేలు కాకతప్పదనుకుంది. అతనిలో తహతహ పెరిగేందుకు కొద్దిరోజులు తాను బెట్టుగా వుండి ఆడించాలనుకుంది. తనను వెదుక్కుంటూ అతనే వస్తాడని విశ్వసించింది. అంచేత తానే చొరవతీసుకొని అతనికి కృతజ్ఞతలుచెపుతూ బయటకు పంపించింది.

## మెప్పుగావి, ముప్పుగావి లేదు:

వరదయ్య ఎలాగో తన విడిదికి చేరాడు. అతని వాలకంచూసి మోహనాంగి నివ్వెఱపోయింది. అతని

మనస్సెందుకో వికలంగావున్నట్లు గ్రహించింది. నిర్ణీత సమయంలో పదరచన పూర్తిచేయలేనేమో అనే బెంగతో ఏదో అలావున్నాడనుకుంది. అతన్ని అనునయిస్తూ అన్నది :

"వరదా! నీవేదో ఒకలా వున్నావు. నీ మనస్సు మనస్సులో వున్నట్లు లేదు. నవాబు పెట్టినగడువు చాలా భాగం అయిపోయింది. ఇక కొద్దిరోజులుమాత్రమే వుంది. ఇంతవరకు నీవు పదరచనకు పూనుకోవైతివి. మాట యెలా దక్కించుకోనడమా అనే బెంగపట్టుకున్నట్లున్నది నీకు. ఏమీ ఫరవాలేదు. మనం మువ్వవెళ్ళి పోదాంపద. ఆస్థానకవి కావాలనే కాంక్ష నీకేమీ లేదు గదా! కనుక పదరచన పూర్తిచేస్తే నీకువచ్చే మెప్పుగాని చెయ్యేకపోతే వచ్చే ముప్పుగాని యేమీలేదు.

వరదయ్య అందుకంగీకరించలేదు. పదరచన పూర్తిచేస్తానని బాధ్యత వహించిన తర్వాత ఆ బాధ్యత నిర్వర్తించకుండా వెళ్ళడం భావ్యంకాదన్నాడు. మోహ

నాంగి. ఏమీ అనలేదు. ఇంతలో అతను హఠాత్తుగా బయలుదేరి ఎక్కడికో వెళ్ళడం మొదలుపెట్టాడు.

**కమల తెల్లబోయింది:**

మోహనాంగి కంపించిపోయింది. అతనికంటబడకుండా అతని వెనువెంటనే తానూ బయలుదేరింది. అతని పరిస్థితిచూసి ఆమెకు అనుమానం కల్గింది. అతను ఏ అస్థానకాంతవలలోనో పడ్డాడేమోఅనికూడా శంకించింది. కొంతదూరంనుంచి అతన్ని పరిశీలించింది. అతను కమల యింటిలో ప్రవేశించడం చూసింది. తన అనుమానం దృఢమైంది. కాని తాను కమలయింటిలోకి వెళ్ళడానికి తటపటాయించింది. అతను తిరిగివస్తాడేమో అని చాలా సేపు వేచిచూసింది. కాని అతనువచ్చేజాడ ఎక్కడా కనబడలేదు. ఆమె గుండెబిగపట్టుకొని కమల యింటిలోకి వెళ్ళింది.

కమల నాట్యంచేస్తోంది. వరదయ్య మంత్రముగ్ధుడైనట్లు మెదలకుండా చూస్తున్నాడు. మోహనాంగి తల

తిరిగిపోయింది. ఆగ్రహంతో ఆమెకళ్లు ఎఱ్ఱబడ్డాయి బొమముడిచిట్లించి కమలవంక తీక్ష్ణంగా చూస్తూ మోహనాంగి వరదయ్యను అక్కడినుంచి తీసుకొని వెళ్ళిపోయింది. ఈ హఠాత్సంఘటనకు కమల తెల్లబోయింది అయినా అతను మళ్ళీరాకుండా వుండడనుకుంది.

## ఇది నిజంగా కుట్రే:

ఇంటికిరాగానే మోహనాంగి బావురుమనిఏడ్చింది ఏం జరిగిందో చెప్పమని వరదయ్యను బ్రతిమాలింది కమల అభ్యర్థన త్రోసివేయలేక తాను ఆమెయింటికి వెళ్ళడం, ఆమె తనకు పానీయం ఇవ్వడం, అనంతరం తాను ఆమెను చూడకుండా వుండలేక ఆమెకోసం వెళ్ళడం; అంతా వివరంగా చెప్పాడు వరదయ్య.

కమల పానీయంలో ఏదో వశీకరణౌషధి కలిపి యిచ్చి వుంటుందని మోహనాంగి శంకించింది. వెంటనే ఒకవైద్యుణ్ణి పిలిపించి దానికి విరుగుడు పెట్టించింది.

దాంతో అతనికి మామూలు మనస్స్వాస్థ్యం చిక్కింది. ఆచూకీ తీయగా తీయగా ఇదంతా కమలా, తులసీ మూర్తి వరదయ్యను శృంగభంగంచెయ్యడానికి చేసిన కుట్ర అని తెలిసింది.

మూర్తీ, కమలా ఈ విషయాలన్నీ తెలుసుకున్నారు. వరదయ్య ఈ సంగతి నవాబుతో చెబుతాడేమో, తమకు ఏంప్రమాదం ముంచుకువస్తుందో అని వారిద్దరూ ప్రాణాలరచేతిలో పెట్టుకొనివున్నారు. కాని వరదయ్య సహృదయుడు. ఆ విషయం ఎక్కడా పొక్కనీయలేదు. యథాప్రకారం రోజూ ఆస్థానానికివెళ్ళి వస్తున్నాడు. పదరచననుగూర్చి నవాబు హెచ్చరిస్తూనే ఉన్నాడు. కాని వరదయ్య నిశ్చలంగా నిర్లిప్తంగా వున్నాడు.

గడువు ఇంకొక రోజుమాత్రమే వుంది.

## పదరచన పూర్తయింది!

క్షేత్రయ్య పదరచనకు ఇంకా సంకల్పించలేదు. మోహనాంగి తల్లడిల్లిపోతోంది. నిశ్చలదీక్షతో మువ్వ

గోపాలుణ్ణి ప్రార్థించడం మొదలుపెట్టింది. అనాడల్లా క్షేత్రయ్యకూడా నిశ్చల ధ్యానయోగంలో ఉన్నాడు. హఠాత్తుగా అతనిలో ఒక దివ్యతేజం వెలుగొందింది. మువ్వగోపాలుడు తనను ఆవేశించినట్లు తోచింది అతనికి. అతనిలో ఆనందం ఆవేశం వురవడించాయి. ఒక నవశక్తి పెల్లుబికింది. వ్రాయడం ప్రారంభించాడు. తెల్లవారే సరికి పదునైదువందల పదాలు పూర్తయ్యాయి.

ప్రత్యూషపవనాలు చల్లగా వీస్తున్నాయి. క్షేత్రయ్య ఒడలు జలదరించింది. అతను కళ్ళుతెరచి చూశాడు. అతనియెదుట పదాలున్నాయి. అవి తాను వ్రాసినదీ లేక మువ్వగోపాలుడు వ్రాసినదీకూడా తనకు స్ఫురణ లేదు. మోహన అతనిప్రక్క సుషుప్తితో మైమరచివుంది. ఆమెనతడు మృదువుగా స్పృశించాడు. ఆమె నిద్రలేచి పదసంకలనం చూసింది. ఆశ్చర్యంతో పరవశించిపోయింది. మువ్వగోపాలుడు వరదయ్యను కటాక్షించినందుకు మోహన నేత్రాంచలాల్లో ఆనందబాష్పాలు తరళించాయి.

ఆ వార్తవిని అందఱూ నివ్వెఱపోయారు. వారిలో ఒక అపూర్వ సంచలనం బయలుదేరింది. నవాబు ఆనం దానికి అవధుల్లేవు. క్షేత్రయ్య ప్రతిజ్ఞకు భంగంకల్పించ డానికి తాను కమలతో కలిసి చేసిన దుస్తంత్రానికి తులసీమూర్తి సిగ్గుపడిపోయాడు. క్షేత్రయ్యనూ అతని పదరచనావైభవాన్ని అతననేకవిధాల సన్నుతించాడు.

నవాబు సెలవుతీసుకొని క్షేత్రయ్య గోల్కొండ నుండి బయలుదేరాడు. అతను ఇంకా కొన్ని క్షేత్రాలు మాత్రం దర్శించాలనుకున్నాడు. ఏ ఆస్థానాన్ని చూడ దలచుకోలేదు. మోహనాంగి తమ్ముణ్ణి ముందుగా అక్కడినుంచే మొవ్వకు పంపివేశారు.

## భద్రాద్రిలో క్షేత్రయ్య :

మోహన, క్షేత్రయ్య గోల్కొండనుంచి యెకా యెకిని భద్రాచలం వెళ్లారు. గోదావరీతీరాన ఆలయ నిర్మాణానికి యత్నాలుజరుగుతున్న రోజులవి. ఆలయం

మనోహరరూపం దాలుస్తోంది. ఆలయస్థలం హృదయంగ మంగా వుంది. నిర్మాణంలో ఉన్న ఆలయానికి ప్రక్కగా గోదావరి గలగలా ప్రవహిస్తోంది. ఆలయనిర్మాణం జరుగుతున్న గుట్టపైనుంచి చూస్తే ఆ నదీదృశ్యం ఎంతో మనోహరంగా వుంటుంది. ఆ ప్రదేశం అంతా అరణ్య మయం. క్షేత్రయ్య భద్రగిరి రాముణ్ణి సేవించి సన్ను తించాడు. శ్రీరామచంద్రుని ఆదర్శజీవితం అతనిహృదయ ఫలకంమీద ప్రగాఢమైన ముద్రవేసింది.

## మల్లికార్జున సందర్శనం :

భద్రగిరినుంచి యిద్దఱూ శ్రీగిరివెళ్ళారు. అడవి దారుల్లో ప్రయాణం చెయ్యడానికి వారు చాలా శ్రమిం చారు. ఆ క్షేత్రంచేరడానికి వారికి ఎన్నో రోజులు పట్టాయి. ఆలయం చాలాపెద్దది. ఒక మహాదుర్గంలాగా వుంది. ఆలయంప్రక్కనే కృష్ణానది ప్రవహిస్తూంటుంది.

అక్కడి శివలింగం ఎక్కడో పాతాళంనుంచి పైకి ఆవిర్భవించిందనీ, శైవక్షేత్రాల్లో శ్రీశైలమల్లికార్జునాలయం మహోత్కృష్టమైనదనీ అందఱూ భావిస్తారు. అక్కడిప్రశాంతత, ఆలయసమున్నతత్వమూ ఆ పరిసరాల వైభవముచూసి క్షేత్రయ్య ముగ్ధుడయ్యాడు. అతను మల్లికార్జునస్వామిమీద కొన్నిపదాలు చెప్పాడు.

## తిరుమలక్షేత్రంలో క్షేత్రయ్య:

అనంతరం వారు తిరుమల వెళ్లారు. శ్రీ వేంకటేశ్వరస్వామి ఎక్కడో ఏడుకొండలపైన అధివసించి వున్నాడు. సప్తగిరులను అధిరోహించడం శ్రమసాధ్యమైనపని. ఆ ప్రాంతం దేవలోకాన్ని మరపిస్తూంటుంది. అక్కడి ప్రకృతిసౌందర్యం నేత్రపర్వంగా వుంటుంది. ఒక్కొకకొండ ఎక్కుతూవుంటే ఒళ్ళు జలదరిస్తుంది. భక్తులకు ఉదొకపరీక్ష. కాని పర్వతాగ్రంచేరి అక్కడి ప్రశాంతవాతావరణాన్ని, స్వామి విగ్రహాన్ని చూస్తే అక్కడికి చేరడానికిపడిన బాధ నిరర్థకం కాదనిపిస్తుంది.

ఆ పుణ్యక్షేత్రాన్ని దర్శించాలని క్షేత్రయ్య ఎప్పటి నుంచో ఉవ్విళ్లూరుతున్నాడు. తుదకు అతనికల ఫలించింది. స్వామివారి దివ్యమూర్తిని చూసి అతను పులకించి పోయాడు. ఆ విగ్రహాన్ని చూస్తున్నకొలదీ అక్కడే వుండి ఆ దివ్యవైభవాన్ని ఇంకా చూడాలనే కౌతూహలం కలిగింది క్షేత్రయ్యకు.

ఆ విగ్రహంలో ఏదో అద్భుతాకర్షణవుంది. దర్శన మాత్రంచేతనే భక్తుల్లో ఆనందాన్ని, ధార్మికచింతనూ కలిగించే మూర్తిమంతమైన విగ్రహం అది. వేంకటేశ్వర స్వామివిగ్రహంలాగా చిత్తోద్రేకాన్ని కల్పించిమైమరపించే మరే విగ్రహాన్నీ క్షేత్రయ్య ఎక్కడా చూడలేదు. స్వామి విగ్రహం ఎంతో ఠీవిగా హుందాగా వుంది. క్షేత్రయ్యకు అక్కడి ప్రతిరేణువూ ఎంతో పవిత్రంగా గోచరించింది.

ఆలయముఖద్వారంలో శ్రీకృష్ణదేవరాయలకాంస్య విగ్రహంవుంది. దానికి ఇరువైపులా ఆయన దేవేరుల విగ్రహాలున్నాయి. శ్రీకృష్ణదేవరాయలు ఆ ఆలయానికి ఎన్నో కాన్కలు భూములు దానంగా ఇచ్చాడు. శ్రీకృష్ణ దేవరాయలకు వేంకటేశ్వరస్వామిపై అపారభక్తివిశ్వాసా లున్నాయి. తనకులదైవం ఆయనే. వేంకటేశ్వరస్వామి తనవివాహానికి ధనాధిపతి అయిన కుబేరునిదగ్గరినుంచి పెద్దమొత్తాన్ని అప్పుగా తీసుకున్నాడట. ఆ ఋణం తీర్చ డానికి గడువు కలియుగాంతం. అంతవరకూ భక్తులు తమశక్తికొలదీ స్వామికి కాన్కలర్పిస్తూ వుంటారు.

వేంకటేశ్వరస్వామికి సంబంధించిన పౌరాణిక గాథలెన్నో వున్నాయి. ఆసక్తితో ఆ గాథలన్నీ తెలిసికొని విస్మయంచెందాడు క్షేత్రయ్య. మోహనా, క్షేత్రయ్యా వేంకటేశ్వరస్వామిని ఆరాధిస్తూ అక్కడ ఒక నెల రోజు లున్నారు. రసవంతాలైన తనకీర్తనలతో శ్రీ వేంకటేశ్వర స్వామిని సన్నుతించిన అన్నమాచార్యులను క్షేత్రయ్య

భక్తిభావంతో స్మరించాడు. తాను తనపదాలతో మువ్వ గోపాలుణ్ణి సేవించినట్లే అన్నమాచార్యులు మధురాతి మధురాలైన తనకీర్తనలతో వేంకటేశ్వరస్వామిని సేవించారు.

## సర్వం గోపాలమయం:

క్షేత్రయ్య దక్షిణాపథంలోని క్షేత్రాలెన్నో దర్శించాడు, మొత్తం అతను ఇరవైక్షేత్రాలదాకా చూశాడు. గోల్కొండ, మదురై తంజావూరు ఆస్థానాల్లో కొన్ని సంవత్సరాలు గడిపాడు. ఆయన ఎక్కడకు వెళ్ళితే అక్కడ ముక్తకంఠంతో గోపాలపదగానం చేశాడు. అతని దృష్టిలో సర్వం గోపాలమయం. ఏ ఆలయానికివెళ్ళినా అక్కడి దేవతామూర్తిలో అతను మువ్వగోపాలుని దివ్య మంగళరూపాన్నే చూసేవాడు. అంచేత అతనికి ఎక్కడా ఎవరితోనూ ఏవిధమైన విప్రతిపత్తీ లేదు. అన్ని మతాల వారి ఆదరణకూ అతను పాత్రుడయ్యాడు.

క్షేత్రయ్య మొవ్వవిడిచి వచ్చి అప్పుడే దగ్గర దగ్గర ఒకదశాబ్దంఅయింది. ఇక అతనికి మువ్వగోపాలుని విరహం దుర్భరమైంది. ఆయన తనను తిరిగి తన దగ్గరికి ఆహ్వానిస్తున్నట్లు అతనికి తోచింది. మోహన వరదయ్య లోని పరిపక్వస్థితిని గుర్తించింది. అతని వయసు ఏమంత పెద్దదికాదు. అయినా తనకంటికి అతను పండిపోయినట్లు కనబడుతున్నాడు. ఇక ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా మువ్వ తిరగివెళ్ళడానికి నిశ్చయించుకున్నారు.

## అదొక దివ్యప్రేమ:

మోహనా, వరదయ్య తిరుమలనుంచి బయలుదేరి యెకాయెకిని మొవ్వతిరిగి వచ్చారు. ఆనాడు శ్రీకృష్ణ జన్మాష్టమి. అప్పటికి కొంతకాలంక్రిందట మోహన తమ్ముడు మొవ్వవచ్చి కవిగా గాయకుడుగా పదకర్తగా క్షేత్రయ్య దక్షిణాపథంలో గడించిన అసాధారణకీర్తి ప్రతిష్టలను గూర్చి అక్కడ అందరికీ చెప్పాడు.

క్షేత్రయ్య అనీ, క్షేత్రజ్ఞుడనీ పేరుగాంచిన తమ వరదయ్యను చూడాలని ఊరుఊరంతా ఉవ్విళ్లూరుతోంది. మోహనా వరదయ్య సరాసరి గోపాలదేవుని ఆలయానికి వెళ్లారు. వారు మువ్వగోపాలుణ్ణి చూసి పదేళ్లయింది. ఆనందబాష్పాలు కారుస్తూ వారు చేతులు జోడించి మువ్వ గోపాలుణ్ణి తనివితీరా నుతించారు.

వారిని చూడాలని పరిసరగ్రామాలనుండి అసంఖ్యాక జనసందోహం వచ్చిచేరింది. క్షేత్రయ్య అన్యచింతనలేకుండా ఏకాగ్రతతో మువ్వగోపాలపదాలు పాడుతున్నాడు. మోహన అభినయిస్తోంది. ఆ సమయంలో ఆమె ఒక ఉజ్జ్వలతారలా మెరిసిపోతోంది. వరదయ్య ముఖంలో దివ్యతేజం వెల్లివిరిస్తోంది. అతను గానంచేసే పదాలన్నీ గోపాలనామాంకితాలు. అవిపైకి కేవలశృంగార పదాలుగా కనబడినా వాటిల్లో అంతర్వాహినిగావున్న అలౌకికప్రేమను మోహన తనదివ్యాభినయంతో సువ్యక్తం

చెయ్యడంచేత ప్రేక్షకులు ఉద్విగ్నతలూగిపోతున్నారు. ఆ సమయంలో వారికి మోహనావరదయ్యలు దివ్య ప్రేమలో తేలిపోతున్న రాధాకృష్ణులుగా గోచరించారు.

## గోపాలపదసాయుజ్యం:

హఠాత్తుగా వరదయ్య వదనంచుట్టూ ఒక తేజః పరివేషం ఏర్పడింది. దివ్యావేశాన్ని అనుభవిస్తున్నట్లు గోచరించింది అతనికి. అతనింకా ఆవేశంలో గోపాల పద సంకీర్తనం చేస్తూనే ఉన్నాడు. క్షణంలో అతనిశరీరంలో నుంచి ఆత్మతేజం వెల్వడి మువ్వగోపాలుణ్ణి చేరింది. గోపాల దేవుడతన్ని తనలో ఐక్యంచేసుకున్నాడు.

మోహన ఇంకా తన్మయత్వంతో నాట్యంచేస్తూనే వుంది. కాని వెనువెంటనే తన వరదయ్యకు బ్రహ్మత్వం సిద్ధించిందనీ, అతను మువ్వగోపాలునిలో సాయుజ్యం

చెందాడని ఆమెకు అవగాహన కలిగింది. ఆమె నేత్రాం చలాల్లో అశ్రుబిందువులు తరళించాయి. ఆ దివ్యాను భూతికి ఆమె శరీరం పులకించిపోయింది. నిమీలిత నేత్రాలతో ఆమె వరదయ్య మీద మృదువుగా వ్రాలి పోయింది. రససిద్ధులైన మోహనావరదయ్యల ఆ అను బంధం విడదీయరానిది.

